శ్రీ మహాగణపతయే నమః

# శ్రీమాత నిస్సీమ మహిమ

## శ్రీ లలితా సహస్రనామములోని కొన్ని నామాలకి లౌకికభావ వివరణ



నండూరి సూర్య సత్య నారాయణ

October 2012

# విషయ సూచిక

## శ్రీ లలితా సహస్రం

# మనవి

శ్రీ లలితా సహస్రం పరిశోధన చేయవలసిన ఇతివృత్తం అనిపిస్తుంది. ఒక్కొక్కరికి ఒక్కొక్క రకమైన అర్థాలు స్ఫురిస్తాయనుకుంటాను. అసలు నిజమేమిటో తెలుసుకోవాలంటే పరిశోధన అవసరం. ఇందులో వేదాన్తాలున్నాయి. అద్వైతం దాగుంది. మన్త్ర-యన్త్ర-తన్త్ర శాస్త్రాలు, యోగసాధన వంటి విషయాలున్నాయి. అనేక ఇతర శాస్త్ర విషయాలున్నాయి.

కానీ ఈ రోజునాటి సామాన్య మానవులకి ఈ విషయాలతో అవసరముందా అనిపించవచ్చు. ఈ మన్త్ర-యన్త్ర-తన్త్ర విషయాలతోనూ వేదాన్తంతోటీ పెద్ద అవసరం లేకపోయినప్పటికీ, సామాన్య మానవులకి కూడా ఉపయోగించే అనేక విషయాలు, అమ్మవారి నామాలలో ప్రతిబింబిస్తున్నాయి. అటువంటి కొన్ని నామాలను గురించిన కొంత వివరణ లిఖితపూర్వంగా అందచేస్తే బాగూంటూందేమోనని ఈ ప్రయత్నం.

"అబద్ధం వా సుబద్ధం వా కుంతీపుత్రో వినాయకః" అన్న రీతిలో తోచినదీ, తోచింపబడినదీ వ్రాయటం జరిగింది. తప్పకుండా తప్పులు ఉండే తీరతాయని నా గట్టి నమ్మకం. తప్పులుంటే దయతో నన్ను క్షమించి, వాటిని తెలియచేసిన అభిజ్ఞులందరికీ

కృతజ్ఞతలు తెలియచేసుకుంటాను; అమ్మను గురించిన అవగాహనలో మరికొంత ముందరకి వెళ్ళే అవకాశం నాకు కలుగుతుంది. ఈ నా ప్రార్థనను మన్నించవలసినదిగా కోరుతున్నాను.

జ్ఞానులకీ శాస్త్రజ్ఞులకీ, పండితులకీ తెలవని క్రొత్త విషయాలేమీ ఈ పుస్తకంలో లేవు. సగటుమానవులకి మాత్రమే వ్రాసినదిది. **It has been written for the intelligent layman by another layman.** అక్కడక్కడ ఊహ్ కల్పిత ఊకని నూకలతో కలపవలసి వచ్చింది. జల్లించేస్తారని తలుస్తాను.

శ్రీ లలితా సహస్రంలోని నామాలు వ్యాసాలలో బోల్డ్ ప్రింటులో చూపించబడ్డాయి.

మిత్రుడు శ్రీ చాగంటి కృష్ణ (బొమ్మగీత శ్రీ కృష్ణుడు), సోదరుడు శరత్ చాలా సహాయం చేశారు. వారికి కృతజ్ఞతలు. అందరితోపాటు వారినీ, వారితోపాటు అందరినీ అనుగ్రహించమని అమ్మకి నివేదన.

నండూరి సూర్య సత్య నారాయణ
(శరన్నవరాత్ర ఉత్సవాలు, 2012)

ఓం శ్రీమాత్రే నమః

# శ్రీ లలితా సహస్రనామం

శ్రీమాతా శ్రీ మహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ, చిదగ్ని కుండ సంభూతా దేవకార్య సముద్యతా, ఉద్యద్భాను సహస్రాభా చతుర్బాహు సమన్వితా, రాగస్వరూప పాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా, మనోరూపేక్షు కోదండా పంచతన్మాత్ర సాయకా, నిజారుణ ప్రభాపూర మజ్జత్ బ్రహ్మాండ మండలా, చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్ కచా, కురువిందమణి శ్రేణీ కనత్కోటీర మండితా, అష్టమీ చంద్ర విభ్రాజ దళికస్థల శోభితా, ముఖచంద్ర కళంకాభ మృగనాభి విశేషకా, వదన స్మర మాంగల్య గృహతోరణ చిల్లికా, వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీనాభ లోచనా, నవచంపక పుష్పాభ నాసాదండ విరాజితా, తారాకాంతి తిరస్కారి నాసాభరణ భాసురా, కదంబమంజరీ క్లుప్త కర్ణపూర మనోహరా, తాటంక యుగళీభూత తపనోడుప మండలా, పద్మరాగ శిలాదర్శ పరిభావి కపోలభూః, నవవిద్రుమ బింబశ్రీ న్యక్కారి రదనచ్ఛదా, శుద్ధవిద్యాంకురాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా, కర్పూరవీటికామోద సమాకర్షి దిగంతరా, నిజసల్లాప మాధుర్య వినిర్భత్సిత కచ్ఛపీ, మందస్మిత ప్రభాపూర మజ్జత్ కామేశ మానసా, అనాకలిత సాదృశ్య చుబుక శ్రీవిరాజితా, కామేశబద్ధ మాంగల్య సూత్ర శోభిత కంధరా, కనకాంగద

కేయూర కమనీయ భుజాన్వితా, రత్నగ్రైవేయ చింతాక లోల ముక్తా ఫలాన్వితా, కామేశ్వర ప్రేమరత్న మణి ప్రతిపణ స్తనీ, నాభ్యాలవాల రోమాళి లతా ఫల కుచ ద్వయీ, లక్ష్య రోమలతా ధారతా సమున్నేయ మధ్యమా, స్తనభార దళన్మధ్య పట్టబంధ వళిత్రయా, అరుణారుణ కౌసుంభ వస్త్ర భాస్వత్ కటీతటీ, రత్న కింకిణికా రమ్య రశనా దామ భూషితా, కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా, మాణిక్య మకుటాకార జానుద్వయ విరాజితా, ఇంద్రగోప పరిక్షిప్త స్మర తూణాభ జంఘికా, గూఢగుల్ఫా కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా, నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా, పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా, సింజాన మణిమంజీర మణ్డిత శ్రీ పదాంబుజా, మరాళీ మన్ద గమనా మహాలావణ్య శేవధిః , సర్వారుణా అనవద్యాంగీ సర్వాభరణ భూషితా, శివ కామేశ్వరాంకస్థా శివా స్వాధీన వల్లభా, సుమేరు మధ్య శృంగస్థా శ్రీమన్నగర నాయికా, చింతామణి గృహాంతస్థా పంచ బ్రహ్మాసన స్థితా, మహా పద్మాటవీ సంస్థా కదంబ వనవాసినీ, సుధా సాగర మధ్యస్థా కామాక్షీ కామదాయినీ, దేవర్షి గణ సంఘాత స్తూయమానాత్మ వైభవా, భండాసుర వధోద్యుక్త శక్తిసేనా సమన్వితా, సంపత్కరీ సమారూఢ సింధూర వ్రజ సేవితా, అశ్వారూఢాధిష్ఠిత అశ్వకోటి కోటిభిరావృతా, చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా, గేయచక్ర రథారూఢ మంత్రిణీ పరిసేవితా, కిరిచక్ర రథారూఢ దండనాథా పురస్కృతా, జ్వాలామాలినికాక్షిప్త వహ్నిప్రాకార మధ్యమా, భండసైన్య వధోద్యుక్త శక్తి విక్రమ హర్షితా, నిత్యా

పరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా, భండపుత్ర వధోద్యుక్త బాలా విక్రమ నందితా, మంత్రిణ్యంబా విరచిత విషంగవధ తోషితా, విశుక్ర ప్రాణహరణ వారాహీ వీర్య నందితా, కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా, మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా, భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ, కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః, మహా పాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసుర సైనికా, కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసుర శూన్యకా, బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుత వైభవా, హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవనౌషధిః, శ్రీమత్ వాగ్భవ కూటైక స్వరూప ముఖ పంకజా, కంఠాధః కటి పర్యంత మధ్యకూట స్వరూపిణీ, శక్తి కూటైకతాపన్న కట్యధోభాగ ధారిణీ, మూల మంత్రాత్మికా మూల కూటత్రయ కళేబరా, కులామృతైక రసికా కులసంకేత పాలినీ, కులాంగనా కులాంతస్థా కౌలినీ కులయోగినీ, అకులా సమయాంతస్థా సమయాచార తత్పరా, మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంధి విభేదినీ, మణిపూరాంతరుదితా విష్ణుగ్రంధి విభేదినీ, ఆజ్ఞాచక్రాంతరాలస్థా రుద్రగ్రంధి విభేదినీ, సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ, తటిల్లతా సమరుచిః షట్ చక్రోపరి సంస్థితా, మహాసక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ, భవానీ భావనాగమ్యా భవారణ్య కుఠారికా, భద్రప్రియా భద్రమూర్తిః భక్త సౌభాగ్యదాయినీ, భక్తిప్రియా భక్తిగమ్యా భక్తివశ్యా భయాపహా, శాంభవీ శారదారాధ్యా శర్వాణీ శర్మదాయినీ, శాంకరీ శ్రీకరీ సాధ్వీ శరచ్చంద్ర నిభాననా, శాతోదరీ శాన్తిమతీ నిరాధారా

నిరంజనా, నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా, నిర్గుణా నిష్కలా శాన్తా నిష్కామా నిరుపప్లవా, నిత్యముక్తా నిర్వికారా నిష్ప్రపంచా నిరాశ్రయా, నిత్యశుద్ధా నిత్యబుద్ధా నిరవద్యా నిరంతరా, నిష్కారణా నిష్కలంకా నిరుపాధిః నిరీశ్వరా, నీరాగా రాగమథనీ నిర్మదా మదనాశినీ, నిశ్చిన్తా నిరహంకారా నిర్మోహా మోహనాశినీ, నిర్మమా మమతాహన్త్రీ నిష్పాపా పాపనాశినీ, నిష్క్రోధా క్రోధశమనీ నిర్లోభా లోభనాశినీ, నిస్సంశయా సంశయఘ్నీ నిర్భవా భవనాశినీ, నిర్వికల్పా నిరాబాధా నిర్భేదా భేదనాశినీ, నిర్నాశా మృత్యుమథనీ నిష్క్రియా నిష్పరిగ్రహా, నిస్తులా నీలచికురా నిరపాయా నిరత్యయా, దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహన్త్రీ సుఖప్రదా, దుష్టదూరా దురాచారశమనీ దోషవర్జితా, సర్వజ్ఞా సాంద్రకరుణా సమానాధిక వర్జితా, సర్వశక్తిమయీ సర్వమంగళా సద్గతిప్రదా, సర్వేశ్వరీ సర్వమయీ సర్వమన్త్ర స్వరూపిణీ, సర్వ యన్త్రాత్మికా సర్వ తన్త్రరూపా మనోన్మనీ, మాహేశ్వరీ మహాదేవీ మహాలక్ష్మీః మృడప్రియా, మహారూపా మహాపూజ్యా మహాపాతకనాశినీ, మహామాయా మహాసత్త్వా మహాశక్తిః మహారతిః, మహాభోగా మహైశ్వర్యా మహావీర్యా మహాబలా, మహాబుద్ధిః మహాసిద్ధిః మహా యోగేశ్వరేశ్వరీ, మహాతన్త్రా మహామన్త్రా మహాయన్త్రా మహాసనా, మహాయాగ క్రమారాధ్యా మహాభైరవ పూజితా, మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణీ, మహాకామేశ మహిషీ మహా త్రిపురసుందరీ, చతుష్షష్టి ఉపచారాఢ్యా చతుష్షష్టి కళామయీ, మహా చతుష్షష్టి కోటి యోగినీ గణసేవితా, మనువిద్యా చంద్రవిద్యా చంద్రమండల మధ్యగా, చారురూపా

చారుహాసా చారుచంద్రకళాధరా, చరాచర జగన్నాథా చక్రరాజ నికేతనా, పార్వతీ పద్మనయనా పద్మరాగ సమప్రభా, పంచ ప్రేతాసనాసీనా పంచ బ్రహ్మ స్వరూపిణీ, చిన్మయీ పరమానన్దా విజ్ఞానఘన రూపిణీ, ధ్యాన ధ్యాతృ ధ్యేయ రూపా ధర్మాధర్మ వివర్జితా, విశ్వరూపా జాగరిణీ స్వపన్తీ తైజసాత్మికా, సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థావివర్జితా, సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిన్ద రూపి ణీ, సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీ ఈశ్వరీ, సదాశివా అనుగ్రహదా పంచకృత్య పరాయణా, భానుమండల మధ్యస్థా భైరవీ భగమాలినీ, పద్మాసనా భగవతీ పద్మనాభ సహోదరీ, ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః, సహస్రశీర్ష వదనా సహస్రాక్షీ సహస్రపాత్, ఆబ్రహ్మకీటజననీ వర్ణాశ్రమ విధాయినీ, నిజాజ్ఞారూపనిగమా పుణ్యాపుణ్య ఫలప్రదా, శ్రుతి సీమన్త సిందూరీ కృత పాదాబ్జధూళికా, సకలాగమ సందోహ శుక్తి సంపుట మౌక్తికా, పురుషార్థప్రదా పూర్ణా భోగినీ భువనేశ్వరీ, అంబికా అనాదినిధనా హరిబ్రహ్మేంద్ర సేవితా, నారాయణీ నాదరూపా నామరూపవివర్జితా, హ్రీంకారీ హ్రీమతీ హృద్యా హేయోపాదేయవర్జితా, రాజరాజార్చితా రాజ్ఞీ రమ్యా రాజీవ లోచనా, రంజనీ రమణీ రస్యా రణత్కింకిణి మేఖలా, రమా రాకేందు వదనా రతిరూపా రతిప్రియా, రక్షాకరీ రాక్షసఘ్నీ రామా రమణలంపటా, కామ్యా కామకళారూపా కదంబకుసుమప్రియా, కల్యాణీ జగతీకందా కరుణారస సాగరా, కళావతీ కళాలాపా కాన్తా కాదంబరీప్రియా, వరదా వామనయనా వారుణీమదవిహ్వలా, విశ్వాధికా వేదవేద్యా

విన్ధ్యాచల నివాసినీ, విధాత్రీ వేదజననీ విష్ణుమాయా విలాసినీ, క్షేత్రస్వరూపా క్షేత్రేశీ క్షేత్రక్షేత్రజ్ఞ పాలినీ, క్షయవృద్ధి వినిర్ముక్తా క్షేత్రపాల సమర్చితా, విజయా విమలా వన్ద్యా వన్దారుజన వత్సలా, వాగ్వాదినీ వామకేశీ వహ్నిమణ్డలవాసినీ, భక్తిమత్ కల్పలతికా పశుపాశవిమోచనీ, సంహృతాశేషపాషండా సదాచార ప్రవర్తికా, తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా, తరుణీ తాపసారాధ్యా తనుమధ్యా తమోపహా, చితిస్తత్ పద లక్ష్యార్థా చిదేకరస రూపిణీ, స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః, పరా ప్రత్యక్ చితీరూపా పశ్యంతీ పరదేవతా, మధ్యమా వైఖరీ రూపా భక్తమానస హంసికా, కామేశ్వర ప్రాణనాడీ కృతజ్ఞా కామపూజితా, శృంగారరస సంపూర్ణా జయా జాలంధర స్థితా, ఓడ్యాణ పీఠ నిలయా బిందుమణ్డల వాసినీ, రహోయాగ క్రమారాధ్యా రహస్తర్పణ తర్పితా, సద్యః ప్రసాదినీ విశ్వసాక్షిణీ సాక్షివర్జితా, షడంగదేవతా యుక్తా షాడ్గుణ్య పరిపూరితా, నిత్యక్లిన్నా నిరుపమా నిర్వాణ సుఖదాయినీ, నిత్యాషోడశికారూపా శ్రీకంఠార్ధశరీరిణీ, ప్రభావతీ ప్రభారూపా ప్రసిద్ధా పరమేశ్వరీ, మూలప్రకృతిః అవ్యక్తా వ్యక్తావ్యక్త స్వరూపిణీ, వ్యాపినీ వివిధాకారా విద్యావిద్యా స్వరూపిణీ, మహాకామేశ నయన కుముద ఆహ్లాద కౌముదీ, భక్త హార్ద తమో భేద భానుమత్ భాను సంతతిః, శివదూతీ శివారాధ్యా శివమూర్తిః శివంకరీ, శివప్రియా శివపరా శిష్టేష్టా శిష్టపూజితా, అప్రమేయా స్వప్రకాశా మనోవాచామగోచరా, 'చిత్'శక్తిః చేతనా రూపా జడశక్తిః జడాత్మికా, గాయత్రీ వ్యాహృతిః సంధ్యా ద్విజబృంద

నిషేవితా, తత్త్వాసనా తత్ త్వం అయీ పంచకోశాంతరస్థితా, నిస్సీమ మహిమా నిత్యయౌవనా మదశాలినీ, మదఘూర్ణిత రక్తాక్షీ మదపాటల గండభూః, చందన ద్రవ దిగ్ధాంగీ చాంపేయ కుసుమప్రియా, కుశలా కోమలాకారా కురుకుల్లా కులేశ్వరీ, కులకుండాలయా కౌలమార్గ తత్పర సేవితా, కుమార గణనాథాంబా తుష్టిః పుష్టిః మతిర్ధృతిః, శాన్తిస్స్వస్తిమతీ కాన్తిః నందినీ విఘ్ననాశినీ, తేజోవతీ త్రినయనా లోలాక్షీకామరూపిణీ, మాలినీ హంసినీ మాతా మలయాచల వాసినీ, సుముఖీ నళినీ సుభ్రూః శోభనా సురనాయికా, కాలకంఠీ కాన్తిమతీ క్షోభిణీ సూక్ష్మరూపిణీ, వజ్రేశ్వరీ వామదేవీ వయోవస్థావివర్జితా, సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా సిద్ధమాతా యశస్వినీ, విశుద్ధి చక్ర నిలయా ఆరక్తవర్ణా త్రిలోచనా, ఖట్వాంగాది ప్రహరణా వదనైక సమన్వితా, పాయసాన్న ప్రియా త్వక్స్థా పశులోకభయంకరీ, అమృతాది మహాశక్తిసంవృతా డాకినీశ్వరీ, అనాహతాబ్జ నిలయా శ్యామాభా వదనద్వయా, దంష్ట్రోజ్జ్వలా అక్షమాలాది ధరా రుధిరసంస్థితా, కాలరాత్ర్యాది శక్త్యౌఘ వృతా స్నిగ్ధౌదన ప్రియా, మహావీరేంద్ర వరదా రాకిణ్యంబా స్వరూపిణీ, మణిపూరాబ్జ నిలయా వదనత్రయ సంయుతా, వజ్రాదిక ఆయుధోపేతా డామర్యాదిభిరావృతా, రక్తవర్ణా మాంసనిష్ఠా గుడాన్న ప్రీత మానసా, సమస్త భక్త సుఖదా లాకిన్యంబా స్వరూపిణీ, స్వాధిష్టానాంబుజ గతా చతుర్వక్త్ర మనోహరా, శూలాద్యాయుధసంపన్నా పీతవర్ణా అతిగర్వితా, మేదోనిష్ఠ మధుప్రీతా బందిన్యాదిసమన్వితా, దధ్యన్నాసక్త హృదయా కాకినీ రూపధారిణీ, మూలాధారాంబుజారూఢా పంచవక్త్రా

అస్థిసంస్థితా, అంకుశాది ప్రహరణా వరదాది నిషేవితా, ముద్గౌదనాసక్త చిత్తా సాకిన్యంబా స్వరూపిణీ, ఆజ్ఞాచక్రాబ్జ నిలయా శుక్లవర్ణా షడాననా, మజ్జాసంస్థా హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా, హరిద్రాన్నైక రసికా హాకినీ రూపధారిణీ, సహస్రదళ పద్మస్థా సర్వవర్ణోప శోభితా, సర్వాయుధధరా శుక్లసంస్థితా సర్వతోముఖీ, సర్వౌదనప్రీతచిత్తా యాకిన్యంబా స్వరూపిణీ, స్వాహా స్వధా అమతిః మేధా శృతిః స్మృతిః అనుత్తమా, పుణ్యకీర్తిః పుణ్యలభ్యా పుణ్యశ్రవణ కీర్తనా, పులోమజార్చితా బంధమోచనీ బర్బరాలకా, విమర్శరూపిణీ విద్యా వియదాది జగత్ప్రసూః, సర్వ వ్యాధిప్రశమనీ సర్వమృత్యునివారిణీ, అగ్రగణ్యా అచింత్యరూపా కలికల్మషనాశినీ, కాత్యాయనీ కాలహన్త్రీ కమలాక్ష నిషేవితా, తాంబూల పూరిత ముఖీ దాడిమీకుసుమ ప్రభా, మృగాక్షీ మోహినీ ముఖ్యా మృడానీ మిత్రరూపిణీ, నిత్యతృప్తా భక్తనిధిః నియన్త్రీ నిఖిలేశ్వరీ, మైత్ర్యాది వాసనా లభ్యా మహాప్రళయసాక్షిణీ, పరాశక్తిః పరానిష్ఠా ప్రజ్ఞాన ఘనరూపిణీ, మాధ్వీపానాలసా మత్తా మాతృకా వర్ణరూపిణీ, మహాకైలాస నిలయా మృణాళ మృదు దోర్లతా, మహనీయా దయామూర్తిః మహాసామ్రాజ్యశాలినీ, ఆత్మవిద్యా మహావిద్యా శ్రీవిద్యా కామసేవితా, శ్రీ షోడశాక్షరీ విద్యా త్రికూటా కామకోటికా, కటాక్ష కింకరీ భూత కమలా కోటి సేవితా, శిరస్స్థితా చంద్రనిభా భాలస్థా ఇంద్రధనుఃప్రభా, హృదయస్థా రవిప్రఖ్యా త్రికోణాంతర దీపికా, దాక్షాయణీ దైత్యహన్త్రీ దక్షయజ్ఞవినాశినీ, దరాందోళిత దీర్ఘాక్షీ దరహాసోజ్జ్వలన్

ముఖీ, గురుమూర్తిః గుణనిధిః గోమాతా గుహజన్మభూః, దేవేశీ దండనీతిస్థా దహరాకాశ రూపిణీ, ప్రతిపన్ ముఖ్య రాకాంత తిథిమండల పూజితా, కళాత్మికా కళానాథా కావ్యాలాప వినోదినీ, సచామర రమా వాణీ సవ్య దక్షిణ సేవితా, ఆదిశక్తిః అమేయా ఆత్మా పరమా పావనాకృతిః, అనేక కోటి బ్రహ్మాండ జననీ దివ్య విగ్రహా, క్లీంకారీ కేవలా గుహ్యా కైవల్య పదదాయినీ, త్రిపురా త్రిజగద్వంద్యా త్రిమూర్తిః త్రిదశేశ్వరీ, త్ర్యక్షరీ దివ్యగంధాఢ్యా సిందూర తిలకాంచితా, ఉమా శైలేంద్రతనయా గౌరీ గంధర్వ సేవితా, విశ్వగర్భా స్వర్ణగర్భా అవరదా వాగధీశ్వరీ, ధ్యానగమ్యా అపరిచ్ఛేద్యా జ్ఞానదా జ్ఞానవిగ్రహా, సర్వ వేదాంత సంవేద్యా సత్యానంద స్వరూపిణీ, లోపాముద్రార్చితా లీలాక్లుప్త బ్రహ్మాండ మండలా, అదృశ్యా దృశ్యరహితా విజ్ఞాత్రీ వేద్యవర్జితా, యోగినీ యోగదా యోగ్యా యోగానందా యుగంధరా, ఇఛ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ, సర్వాధారా సుప్రతిష్ఠా సదసద్ రూపధారిణీ, అష్టమూర్తిః అజాజైత్రీ లోకయాత్రా విధాయినీ, ఏకాకినీ భూమరూపా నిర్ద్వైతా ద్వైతవర్జితా, అన్నదా వసుదా వృద్ధా బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ, బృహతీ బ్రాహ్మణీ బ్రాహ్మీ బ్రహ్మానందా బలిప్రియా, భాషారూపా బృహత్సేనా భావాభావవివర్జితా, సుఖారాధ్యా శుభకరీ శోభనాసులభా గతిః, రాజరాజేశ్వరీ రాజ్యదాయినీ రాజ్యవల్లభా, రాజత్కృపా రాజపీఠ నివేశిత నిజాశ్రితా, రాజ్యలక్ష్మీః కోశనాథా చతురంగ బలేశ్వరీ, సామ్రాజ్య దాయినీ సత్యసంధా సాగరమేఖలా, దీక్షితా దైత్యశమనీ సర్వలోక వశంకరీ, సర్వార్థ దాత్రీ సావిత్రీ

సచ్చిదానంద రూపిణీ, దేశకాల అపరిఛ్చిన్నా సర్వగా సర్వమోహినీ, సరస్వతీ శాస్త్రమయీ గుహాంబా గుహ్య రూపిణీ, సర్వోపాధి వినిర్ముక్తా సదాశివ పతివ్రతా, సంప్రదాయేశ్వరీ సాధు ఈ గురుమండల రూపిణీ, కులోత్తీర్ణా భగారాధ్యా మాయా మధుమతీ మహీ, గణాంబా గుహ్యకారాధ్యా కోమలాంగీ గురుప్రియా, స్వతంత్రా సర్వతంత్రేశీ దక్షిణామూర్తి రూపిణీ, సనకాది సమారాధ్యా శివజ్ఞాన ప్రదాయినీ, చిత్కలా ఆనందకలికా ప్రేమరూపా ప్రియంకరీ, నామపారాయణ ప్రీతా నందివిద్యా నటేశ్వరీ, మిథ్యాజగత్ అధిష్ఠానా ముక్తిదా ముక్తిరూపిణీ, లాస్యప్రియా లయకరీ లజ్జా రంభాది వందితా, భవ దావ సుధావృష్టిః పాపారణ్య దవానలా, దౌర్భాగ్య తూల వాతూలా జరాధ్వాంతర విప్రభా, భాగ్యాబ్ధి చంద్రికా భక్త చిత్త కేకి ఘనాఘనా, రోగపర్వతదంభోళిః మృత్యుదారు కుఠారికా, మహేశ్వరీ మహాకాళీ మహాగ్రాసా మహాశనా, అపర్ణా చండికా చండముండాసురనిషూదినీ, క్షరాక్షరాత్మికా సర్వలోకేశీ విశ్వధారిణీ, త్రివర్గదాత్రీ సుభగా త్ర్యంబకా త్రిగుణాత్మికా, స్వర్గాపవర్గదా శుద్ధా జపాపుష్ప నిభాకృతిః, ఓజోవతీ ద్యుతిధరా యజ్ఞరూపా ప్రియవ్రతా, దురారాధ్యా దురాధర్షా పాటలీకుసుమ ప్రియా, మహతీ మేరునిలయా మందారకుసుమ ప్రియా, వీరారాధ్యా విరాడ్రూపా విరజా విశ్వతోముఖీ, ప్రత్యగ్రూపా పరాకాశా ప్రాణదా ప్రాణరూపిణీ, మార్తాండ భైరవారాధ్యా మంత్రిణీ న్యస్త రాజ్యధూః, త్రిపురేశీ జయత్సేనా నిస్త్రైగుణ్యా పరాపరా, సత్యజ్ఞానానంద రూపా సామరస్య పరాయణా, కపర్దినీ కళామాలా కామధుక్

కామరూపిణీ, కళానిధిః కావ్యకళా రసజ్ఞా రసశేవధిః, పుష్టా పురాతనా పూజ్యా పుష్కరా పుష్కరేక్షణా, పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరా, పాశహస్తా పాశహన్త్రీ పరమన్త్రవిభేదినీ, మూర్తా అమూర్తా అనిత్యతృప్తా మునిమానస హంసికా, సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామినీ సతీ, బ్రహ్మాణీ బ్రహ్మ జననీ బహురూపా బుధార్చితా, ప్రసవిత్రీ ప్రచండా ఆజ్ఞా ప్రతిష్ఠా ప్రకటాకృతిః, ప్రాణేశ్వరీ ప్రాణదాత్రీ పంచాశత్పీఠ రూపిణీ, విశృంఖలా వివిక్తస్థా వీరమాతా వియత్ప్రసూః, ముకుందా ముక్తినిలయా మూలవిగ్రహ రూపిణీ, భావజ్ఞా భవరోగఘ్ని భవచక్ర ప్రవర్తినీ, ఛందస్సారా శాస్త్రసారా మన్త్రసారా తలోదరీ, ఉదారకీర్తిః ఉద్దామవైభవా వర్ణరూపిణీ, జన్మ మృత్యు జరా తప్తజన విశ్రాన్తి దాయినీ, సర్వోపనిషదుద్ఘుష్టా శాన్త్యతీత కళాత్మికా, గంభీరా గగనాంతస్థా గర్వితా గానలోలుపా, కల్పనారహితా కాష్ఠా అకాంతా కాన్తార్ధ విగ్రహా, కార్య కారణ నిర్ముక్తా కామకేళి తరంగితా, కనత్ కనక తాటంకా లీలావిగ్రహ ధారిణీ, అజా క్షయవినిర్ముక్తా ముగ్ధా క్షిప్ర ప్రసాదినీ, అన్తర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా, త్రయీ త్రివర్గ నిలయా త్రిస్థా త్రిపురమాలినీ, నిరామయా నిరాలంబా స్వాత్మారామా సుధాసృతిః, సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా, యజ్ఞప్రియా యజ్ఞకర్త్రీ యజమాన స్వరూపిణీ, ధర్మాధారా ధనాధ్యక్షా ధనధాన్య వివర్ధినీ, విప్రప్రియా విప్రరూపా విశ్వభ్రమణ కారిణీ, విశ్వగ్రాసా విద్రుమాభా వైష్ణవీ విష్ణురూపిణీ, అయోనిః యోనినిలయా కూటస్థా కులరూపిణీ, వీరగోష్ఠీప్రియా వీరా నైష్కర్మ్య

నాదరూపిణీ, విజ్ఞానకలనా కల్యా విదగ్ధా బైందవాసనా, తత్త్వాధికా తత్త్వమయీ తత్త్వమర్థ స్వరూపిణీ, సామగాన ప్రియా సౌమ్యా సదాశివ కుటుంబినీ, సవ్యాపసవ్య మార్గస్థా సర్వాపద్ వినివారిణీ, స్వస్థా స్వభావ మధురా ధీరా ధీరసమర్చితా, చైతన్యార్ఘ్య సమారాధ్యా చైతన్య కుసుమప్రియా, సదోదితా సదా తుష్టా తరుణాదిత్య పాటలా, దక్షిణాదక్షిణ ఆరాధ్యా దరస్మేర ముఖాంబుజా, కౌలినీకేవలా అనర్ఘ్యకైవల్య పదదాయినీ, స్తోత్ర ప్రియా స్తుతిమతీ శృతి సంస్తుత వైభవా, మనస్వినీ మానవతీ మహేశీ మంగళాకృతిః, విశ్వమాతా జగత్ ధాత్రీ విశాలాక్షీ విరాగిణీ, ప్రగల్భా పరమోదారా పరామోదా మనోమయీ, వ్యోమకేశీ విమానస్థా వజ్రిణీ వామకేశ్వరీ, పంచయజ్ఞ ప్రియా పంచప్రేత మంచాధిశాయినీ, పంచమీ పంచభూతేశీ పంచ సంఖ్యోపచారిణీ, శాశ్వతీ శాశ్వతైశ్వర్యా శర్మదా శంభుమోహినీ, ధరా ధరసుతా ధన్యా ధర్మిణీ ధర్మవర్ధినీ, లోకాతీతా గుణాతీతా సర్వాతీతా శమాత్మికా, బంధూక కుసుమప్రఖ్యా బాలా లీలావినోదినీ, సుమంగళీ సుఖకరీ సువేషాఢ్యా సువాసినీ, సువాసిన్యర్చన ప్రీతా ఆశోభనా శుద్ధమానసా, బిందు తర్పణ సంతుష్టా పూర్వజా త్రిపురాంబికా, దశముద్ర సమారాధ్యా త్రిపురాశ్రీ వశంకరీ, జ్ఞానముద్రా జ్ఞానగమ్యా జ్ఞాన జ్ఞేయ స్వరూపిణీ, యోనిముద్రా త్రిఖండేశీ త్రిగుణా అంబా త్రికోణగా, అనఘా అద్భుతచారిత్రా వాంఛితార్థ ప్రదాయినీ, అభ్యాసాతిశయ జ్ఞాతా షడధ్వాతీత రూపిణీ, అవ్యాజ కరుణా మూర్తిః అజ్ఞానధ్వాంత దీపికా, ఆబాలగోప విదితా సర్వానుల్లంఘ్య

శాసనా, శ్రీచక్రరాజ నిలయా శ్రీమత్ త్రిపుర సుందరీ, శ్రీ శివా శివశక్త్యైక్య రూపిణీ లలితాంబికా ।

ఓం శ్రీమాత్రే నమః

అధ్యాయము 01

# శ్రీ కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ శ్రీ కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా

శ్రీ లలితా సహస్రనామావళిలోని గూఢార్థాలతోకూడిన కొన్ని నామాలను గురించి పూర్తిగా అర్థం చేసుకోవాలనుకోవటం కష్టమని నాకు అనిపిస్తుంది. ప్రతి నామంగూడా ఒక మంత్రమేనని అభిజ్ఞులు చెప్పుతూంటారు. 'సౌభాగ్య భాస్కరం' రచించిన భాస్కరునితోసహా చాలామంది భాష్యకారులూ, ప్రవచనకారులూ ఈ నామాలగురించి ఇదివరలో వివరించారు. నాకున్న కొద్దిపాటి సంస్కృతభాషాపరిచయంతో సాహసంచేసి ఈ సహస్రనామావళిలోని రెండు నామాలగురించి ఆ జగన్మాత నాకు తోపించినంతమేరకు చెప్పాలనుకోవటం ఈ వ్యాసం ఉద్దేశ్యం. మొదటగా చెప్పదలుచుకున్న నామం, "**కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ**". రెండవ నామం, "**కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా**. ఈ రెండు నామాలూ కొంచెం విచిత్రమైన అర్థాలతో కూడినవి. ఒకలా చూస్తే పరమ శృంగారం. మరోలా చూస్తే అత్యంత మహోదారమైనవి, మహామహిమాన్వితమైనవి.

ఈ నామాలలో అనౌచిత్యం ఏమీలేదని కొందరి అభిపాయం. కాళిదాసాది మహాకవులు కూడా ఇటువంటి వర్ణనలు చేశారు; జయదేవ అష్టపదులు, క్షేత్రయ్య పదాలు, అన్నమయ్య శృంగార కీర్తనలు కూడా ఈ కోవలోకి చెందినవే; అందుచేత అనౌచిత్య ప్రసక్తి లేదని వీరి అభిప్రాయం.

అయితే, కొందరికి ఔచిత్యంగా తోచినది మరికొందరికి అనౌచిత్యంగా తోచటానికి అవకాశం లేక పోలేదు. క్షేమేంద్రుడు ఔచిత్యం ప్రధానమన్నాడు. "అంబికారమణః" అని ఒక కవి వ్రాసినందుకు, ఈ పదప్రయోగాన్ని హేమచంద్రుడు తన "కావ్యానుశాసన" శాస్త్రంలో "విరుద్ధ

బుద్ధి కృత" దోషంగా తప్పు పట్టాడు. బహుశా మనం తరచుగా చెప్పే "మాధవుడు" వంటి పదాలు కూడా హేమచంద్రునికి నచ్చక పోయుండవచ్చు. తల్లితండ్రులని శృంగారదృష్టితో తలవటం మంచి సంస్కారం కాదనీ, అందులోనూ జగత్తుకే మాతాపితరులైనవారికి సంబంధించిన ఈ రెండు నామాల అర్థాలు అనౌచిత్యంగా తోస్తాయని కొందరి అభిప్రాయం. అనౌచిత్యం రసభంగానికి ముఖ్యకారణమని ఆనందవర్ధని "ధ్వన్యాలోకం" తెలుపుతోంది – "అనౌచిత్యాదృతే నాన్యద్ రసభంగస్య కారణం". ఇతను రసభంగాన్ని వివరిస్తూ, అధమ శృంగారపద్ధతులని రాజాదులకీ, ఉత్తమదేవతాదులకీ అన్వయించటం నాటకాలలోనైనా, శ్రవ్యకావ్యాలలోనైనా అనౌచిత్యమే – "అభినేయార్థే అనభినేయార్థే వా కావ్యే యదుత్తమ ప్రకృతేః రాజాదేః ఉత్తమ ప్రకృతిభిః నాయికాదిభిస్సహ గ్రామ్య సంభోగవర్ణనం, తత్పిత్రోః సంభోగవర్ణనమివ సుతరాం అసభ్యం; తథైవ ఉత్తమదేవతాది విషయం" – అన్నాడు. హేమచంద్రుడు "ప్రకృతి–వ్యత్యయం" అనే రసదోషాన్ని వివరిస్తూ దేవతలకి మానుష ప్రకృతులను ఆపాదించగూడదని, "తద్వర్ణనం హి పిత్రోః సంభోగవర్ణనమివ అత్యన్తమనుచితం" అని వివరించాడు. కాళిదాసుని కవితాశక్తి ప్రభావం కుమారసంభవంలో చేసిన హరగౌరీ సంభోగవర్ణన దోషంగా భాసించకుండా కాపాడింది అని ఆనందవర్ధనుడు, హేమచంద్రుడు, మొదలైన శాస్త్రజ్ఞులు అభిప్రాయపడ్డారు. "మహాకవీనామపి ఉత్తమదేవతా విషయ ప్రసిద్ధ సంభోగశృంగార నిబన్ధనాది అనౌచిత్యం శక్తితిరస్కృతత్వాత్ గ్రామ్యత్వేన న ప్రతిభాసతే; యథా కుమారసంభవే దేవీ సంభోగవర్ణనం" – అని ధ్వన్యాలోకం. మహాకవులు తమ తమ ప్రతిభా శక్తులతో ఇటువంటి దోషాలని కప్పిపుచ్చేసుకున్నా, తప్పు తప్పే – "ఏవం విధే విషయే మహాకవీనామపి అసమీక్ష్యకారితా లక్ష్యే దృశ్యతే స దోష ఏవ" – అనీ, రామాయణాదులు ఇప్పటికీ భాసిస్తున్న కారణం ఔచిత్యంతో గూడిన రసపోషణేననీ ఆనందవర్ధనుడు తీర్పు చెప్పాడు.

ఇక మరో విషయాన్ని గురించి కూడా చూద్దాం. ఈ నామాలలో

నిగూఢంగా ఉన్న అర్థాలేమైనా ఉన్నాయా? అనౌచిత్యమేమీలేదని చెప్పేవారి ప్రకారం నిగూఢార్థాలేమీ లేవు. వ్యాస మహర్షి తను చెప్పదలుచుకున్నది సూటిగా చెప్పేశాడు. వెతికి వెతికి పట్టుకోవాల్సిన మరో అర్థాలేమీ లేవని వీరి అభిప్రాయం. ఈ అభిప్రాయంతోగూడా అందరూ ఏకీభవించాలని లేదు. కొందరు కవులు "శ్లేష"తో గూడిన పదాలూ, శ్లోకాలూ వ్రాయటం మనకి తెలిసిన విషయమే. ఈ సందర్భంలో ముఖ్యంగా శ్రీహర్షుని చెప్పాల్సి వస్తుంది. నైషధం, 14వ సర్గ, 85వ శ్లోకం "అవామా వామార్ధే ... సిద్ధ్యతు స తే" అనే శ్లోకం ఒక విషయమై చాలా ప్రసిద్ధి పొందినది. దమయంతి స్వయంవరానంతరం సరస్వతీదేవి నలుని ఆశీర్వదించిన ఈ శ్లోకంలో బాహ్యంగా కనిపించకుండా చిన్తామణి మన్త్రం నిక్షిప్తమై ఉన్నదని చెప్పుతూంటారు. ఉడాలి సుబ్బరామ శాస్త్రి గారు ఈ శ్లోకాన్ని వివరిస్తూ, దేవతామూర్తి పక్షంగాను, చిన్తామణి మన్త్ర పక్షంగాను, శ్రీచక్ర యన్త్ర పక్షంగానూ, మూడు విధాలుగా అర్థం చెప్పుతూ చక్కటి వ్యాఖ్యానం చేశారు. వాల్మీకి సుందరకాండ బయటికి తెలవని బీజాక్షర సమన్వితమనీ, దీని పారాయణ మహోపకారియనీ చెప్పటంగూడా ఉంది గదా! అంటే నిగూఢార్థాలతో రచించటం కూడా ఒక సాంప్రదాయమే.

పైన చెప్పిన విషయాల సారాంశం, ఒకటి: ఔచిత్య–అనౌచిత్యాలు అన్నవి వ్యక్తిగత అభిప్రాయాలే అయినా శాస్త్ర మర్యాద మనకి దారి చూపిస్తుంది; రెండు: పై నామాలలో నిగూఢార్థాలు లేవని చెప్పలేము. ఈ దృష్టితో చూస్తే, ఈ నామాలకి బాహ్యంగా ఉన్న శృంగారార్థాలుగాక, వేరే అంతరార్థమో లేక మరో అర్థమో అంటూ ఉంటే అది ఏమయ్యుండవచ్చు అన్న తపన ఈ క్రింద వివరణకి దారి తీసింది. తప్పో ఒప్పో అభిజ్ఞులు నిర్ణయిస్తారని ఆశిస్తున్నాను.

మొదట, "**కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ**" గురించి చర్చిద్దాం. బాహ్యంగా తోచే అర్థం వదిలేద్దాం. గూఢార్థాన్ని మాత్రమే చర్చిద్దాం. ఈనామానికి, రెండు నామాలకు ముందరగా "**కామేశబద్ధ మాంగల్యసూత్రశోభిత కంధరా**" అని ఓనామం వస్తుంది. కామేశునిచే

కట్టబడిన మంగళసూత్రంతో అమ్మ కంఠం శోభిస్తోందిట. సాధారణంగా ఏ కన్యకైనా వివాహం అయిన తరువాత అందరూ ఆత్రుతగా వినాలనుకొనే శుభవార్తలు భార్యాభర్తల అన్యోన్యత, వారి సంతానం గురించీ. ఆ అన్యోన్యత, సంతానం గురించీ తెలియచేసేది ఈ "**కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ**" అనే నామం. "యా ప్రసూతే సా భార్యా" అంటూ, పిల్లలని కనటం భార్య లక్షణంగా చాణక్యుడు సూత్రీకరించాడు. సంతానం కావాలనుకొనే ఆమెకి ముందరగా భర్తృప్రేమ లభించాలి. కామేశ్వరునుంచి అమ్మ పొందిన ప్రేమ, రత్నాలూ–మణులూవలె చాలా విలువైనది ("ప్రేమరత్నమణి"). అసలు సిసలైనది. ఇక సంతానంకూడా గలిగిందంటే ఆ దంపతుల ప్రేమ పండినట్లే గదా! బిడ్డలుకలిగి, వారికి స్తన్యం ఇవ్వటం (పాలు కుడిపే స్త్రీ – "స్తనీ") భర్తృ ప్రేమకి ప్రతిఫలం ("ప్రతిపణ"). కామేశ్వరునుంచి నీవు పొందిన ప్రేమకి ప్రతిఫలంగా సంతానాన్ని కని, వారికి స్తన్యమిస్తున్న ఓ తల్లీ, నీకు నమస్కారం! ఈ నామతత్త్వాన్నిబట్టి మనకు అర్థంఅయ్యేదేమిటంటే, ఈనామాన్ని జపించే గృహిణులు అపారమైన భర్తృప్రేమతోపాటు, గణనాయకుడివంటి నాయకుడినీ, విద్యావంతుడినీ, కుమారస్వామివంటి వీరుడినీ, జ్ఞానేశ్వరుడినీ సంతానంగాకూడా పొందగలరని.

ఒక విషయం మనం గుర్తించాలి. ఏ శాస్త్రమైనా సరే, సాధారణంగా ఒక పుస్తకంలోని గూఢమైన లేక నిక్షిప్తంగావున్న విషయాలని అవగాహన చేసుకోవాలంటే మరో కొన్ని శాస్త్రాలనీ, పుస్తకాలనీ కూడా తప్పకుండా పరిశీలించవలసి వస్తుంది. ఈ సందర్భంలో ఆదిశంకరుల సౌన్దర్య లహరి, భవానీ భుజంగప్రయాత స్తోత్రం – ఈ రెంటినీ ఒకసారి పరిశీలిద్దాం. కొందరి ఉద్దేశ్యంలో భవానీ భుజంగప్రయాత స్తోత్రం, క్లుప్తంగా చెప్పిన సౌన్దర్య లహరి. సౌన్దర్య లహరిలోని 72వ శ్లోకంలో అమ్మవారి స్తనయుగము – "సమం దేవి స్కన్దద్విపవదనపీతం స్తనయుగం తవేదం నః ఖేదం హరతు సతతం...." అని స్తుతింపబడింది. గజాననునికీ స్కందునికీ సమంగా పాలుకుడుపుతున్న అమ్మవారి స్తనములు మా దుఃఖాలను ఎల్లపుడూ హరింపచేయుగాక – అని ప్రార్థన. అంటే మాకు

ఆకలిదప్పుల బాధలు ఎప్పుడూ రాకుండుగాక – అని భావం. మాతృభావంతో అమ్మ స్తనద్వయాన్ని స్తుతిస్తూ చెప్పిన మరికొన్ని శ్లోకాలు గూడా సౌన్దర్యలహరిలో ఉన్నాయి. భవానీ భుజంగప్రయాత స్తోత్రంలోగూడా ఈ స్తనయుగం – "భజే దుగ్ధపూర్ణాభిరామం తవేదం మహాహారదీప్తం సదా ప్రస్నుతాస్యం" – అని స్తుతింపబడింది. ఆదిశంకరులకి తమచిన్నప్పుడు అమ్మవారు తన చనుబాలనివ్వటం జరిగిందనీ, అందుకు కృతజ్ఞతతో ఇలా స్తుతి చేశారని చెప్పుతూంటారు. ఈ నేపథ్యంలో ఆలోచిస్తే, "**కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ**" అనే నామం మాతృభావంతో గ్రహించవచ్చు. ఈ దివ్యనామజపం భార్యాభర్తలమధ్య అనురాగమూ, చక్కటి సంతానమూ కలిగించి, ఆకలిదప్పుల సమస్యలు లేకుండా చేయగలదు.

ఇక "**కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా**" అనే మరో నామం గురించి చర్చిద్దాం. సంస్కృతంలోని 'ఊరు' అన్నపదం రెండు అర్థాలతో కూడినది. ఒక అర్థం, తొడ(లు) అని. ఈ అర్థంతో ఈ నామాన్ని విశ్లేషణ చేస్తే బాహ్యార్థం మాత్రమే స్ఫురిస్తుంది. 'ఊరు' అన్నపదానికి మరో అర్థం, 'కమ్మలు' (మోనియర్ విలియమ్స్ డిక్షనరీ ప్రకారం shank; ఆప్టే డిక్షనరీ ప్రకారం stem). మనం తాటాకు కమ్మలు, చెవి కమ్మలు అంటూంటాము, ఆ కమ్మలే. సంస్కృతంలో "తాటంక" అన్నా ఇదే అర్థం. ఎప్పుడో పూర్వకాలంలో, స్త్రీలు భర్త బ్రతికున్నంతవరకూ తాటాకుకొసలని చెవికి ప్రేలాడేలా దుద్దులుగానూ, తాళిగానూ కట్టుకునేవారట. 'తాటంక' అంటే తాటాకులుతో చేసిన తాళి. అది సౌభగ్యచిహ్నమయింది. రానురాను చెవికమ్మలుగా, తాటాకుకొసకమ్మలకి బదులు క్రమంగా నేటి దుద్దులు వచ్చాయి.

ఈ నామంలో "సౌభాగ్య" అన్న పదమెందుకుంది? "కామేశ జ్ఞాత మార్దవోరు ద్వయాన్వితా" అంటే సరిపోనుగదా! తాటంకాలు సౌభాగ్యాన్ని సూచిస్తున్నాయని మనకి ప్రత్యేకించి తెలుపుతోంది ఈ పదప్రయోగం. అలాగే "మార్దవ" అన్న పదప్రయోగం. ఇప్పటికీ అమ్మవారి కొన్ని కొన్ని

ఆలయాల దగ్గిర, లేత (మార్దవ) తాటాకు కమ్మలని (ఊరు) చుట్టి, ఆ చుట్ట ఊడిపోకుండా రెండు గాజులతో కలిపి ముడి వేసి అమ్ముతూంటారు. ఈ చుట్టలని "బిచ్చోలె" అంటారు. తమిళంలో "ఓలె" అంటే చుట్టబడినది. కొందరు గృహిణులు ఇప్పటికీ వరలక్ష్మీ వ్రతానికి తమ ఇళ్ళల్లో పెట్టుకునే కలశాన్ని ఈ "బిచ్చోలె" తో అలంకరిస్తూంటారు. ఇలా చుట్టబడే తాటాకులు లేతవై ఉండాలి. ఎండిపోయినవైతే, చుట్టుకోకుండా, విరిగిపోతాయి. "సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా" అంటే రెండు చెవులకీ ఉన్న సౌభాగ్య చిహ్నాలైన మృదువైన దుద్దుకమ్మలు. "కామేశ జ్ఞాత సౌభాగ్య" – అవి ఎంతగా సౌభాగ్యాన్ని సూచిస్తున్నాయో అది ఆ కామేశునకే ఎరుక. ఈ సందర్భంలో మనకి జ్ఞాపకం వచ్చేది పరమశివుని హాలాహల భక్షణం. విషం తీసుకున్నా నీ సౌభాగ్యానికి ఏమీ చికాకురాదని నీ భర్త కామేశునకు తెలుసునని సూచిస్తూ రెండు చెవులా మృదువైన దుద్దుకమ్మలు గలిగిన ఓ తల్లీ – నీకు నమస్కారం.

ఈ తాటంక మహిమను ఆది శంకరులు చాలా సౌందర్యంగా చెప్పారు. "సుధామప్యాస్వాద్య ప్రతిభయజరామృత్యుహరిణీం, విపద్యన్తే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః, కరాళం యత్ క్ష్వేళం కబళితవతః కాలకలనా న శంభోస్తన్మూలం తవ జనని తాటంకమహిమా" – అని సౌందర్యలహరిలోని 28వ శ్లోకం. స్వర్గవాసులైన బ్రహ్మేంద్రాది దేవతలు అమృతం త్రాగికూడా మృత్యువాత పడుతున్నారు. కానీ శంభుడు మాత్రం కరాళవిషాన్ని త్రాగికూడా కాలాతీతుడై ఉన్నాడంటే అదంతా నీ తాటంకమహిమే గదా! –అని ఆదిశంకరుల స్తుతి.

దేవతలు శివుని స్తుతించి, ఈ విషాన్ని నువ్వు తీసుకుని, "ప్రాణిసందోహముం బ్రదికింపవే" ఈశ్వరా, అని ప్రార్థించినప్పుడు ఆయన, అలాగే, పళ్ళరసం తాగేసినట్లు తాగేస్తాను – "భక్షింతును మధుర సూక్ష్మ ఫలరసము క్రియన్" (భాగవతం, 8వ స్కందం) అన్నాడు. కానీ భార్యా–బిడ్డలు ఉన్నవాడు కాబట్టి విషం పుచ్చుకునేముందర భార్యకి చెప్పటం మంచిదనిపించింది. ఆమెకి చెప్పాడు. ఆహా, తప్పకుండా పుచ్చుకోండి,

తనకేమీ భయం లేదంది ఆవిడ. ఈ కథ విన్న పరీక్షిత్తు ఆశ్చర్యపోయి, విషం త్రాగటానికి శివుడు ఒప్పుకోవటమేమిటి, దానికి పార్వతి నిశ్చింతగా తలూపడమేమిటి – "అయ్యుమ ప్రాణేశ్వరునెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానల జ్వాలలన్" – అని శుకమహర్షిని అడిగాడు. ఆవిడకి భయమెందుకు, – "మ్రింగెడువాడు విభుండని, మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్, మ్రింగుమనె సర్వమంగళ మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!" అంటూ శుకుడిచ్చిన సమాధానాన్ని పోతనగారు అద్భుతంగా తెలియచేశారు మనకి. శివుడు విషం తీసుకోవటానికి శివ పార్వతులు ఇద్దరూ ఏమీ అడ్డుచెప్పకుండా మృదువుగా అంగీకరించేశారు. అమ్మ సౌభాగ్యబలం ఎంత గొప్పదో ఆ కామేశునికి తెలుసు – "కామేశ జ్ఞాత సౌభాగ్య". అందుకే ఆ విషభక్షణ వీరసాహసం! అటువంటి ఓ తల్లీ – నీకు నమస్కారం. "కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా" అన్నది మాంగల్యబలం కోసం జపించాల్సిన దివ్య నామం.

సహస్రనామావళిలో "**తాటంకయుగళీభూత తపనోడుప మండలా**" – సూర్యచంద్రులే అమ్మ తాటంకములు అని మరో నామం. అమ్మ సౌభాగ్యం ఆచంద్రతారార్కము. ఇదే విషయం "**కామేశ్వరప్రాణనాడీ**" అనే మరో నామం కూడా తెలియచేస్తూంది. అందరు స్త్రీలూ అన్నిరకాల ఆభరణాలూ ధరించగూడదు. అలా ధరించటం ఒక అమ్మకే తగును అని సహస్రనామావళిలోని "**సర్వాభరణ భూషితా**" అనే నామం చెప్పుతోంది. సౌభాగ్యబలాన్ని చెవికమ్మలు తెలియచేస్తాయి. ఈ రోజుల్లో దుద్దులూ, కమ్మలూ ధరించటం మానివేసి చెవులని బోసిగా వదిలివేయుటమో లేక వింతవికృతి శోభకోసమని నకిలీ నగలని ధరించటమో చూస్తున్నాము. అది సౌభాగ్యం కాదు, దౌర్భాగ్యం!

ఇతర సహస్రనామావళిలతో పోలిస్తే శ్రీ లలితా సహస్రనామావళి చాలా విభిన్నంగా ఉంటుందనిపిస్తుంది. ఇందులో "**శ్రీ మాతా**" అనే మొదటి నామం సృష్టిని తెలియచేస్తూంటే, ఆఖరిని వచ్చే నామాలలో, "**శ్రీ శివా, శివ**

**శక్త్యైక్య రూపిణీ**" అన్నవి లయాన్ని తెలియచేస్తాంటాయి. "**శ్రీమత్సింహాసనేశ్వరీ**" అన్న 3వ నామం సృష్టి-స్థితి-లయ ప్రక్రియల ప్రారంభప్రస్తావన చేస్తుంది. ఆతరువాత దాదాపు చివరివరకూ వచ్చే నామాలన్నీ స్థితి ప్రక్రియలోని తతంగం. ఈ తతంగంలో, పుట్టిన తరువాత పెరగటం (**పంచతన్మాత్ర సాయకా**), అలంకారాలూ, ఆభరణాలూ ఉంటాయి, మాటలు ఎక్కడ పుట్టుతాయి, ఎలా వస్తాయి, ఎలా వ్యక్తీకరింపబడతాయి (**పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ**) అన్న విజ్ఞాన శాస్త్రం అవగతమౌతుంది (**భాషారూపా, విజ్ఞానఘనరూపిణీ, శాస్త్రమయీ, జ్ఞానదా**). శ్రీచక్ర నిర్మాణం ఒక రేఖాగణితం (**చక్రరాజ నికేతనా, శ్రీచక్రరాజ నిలయా**). "**మనువిద్యా, చంద్రవిద్యా, సిద్ధవిద్యా, ఆత్మవిద్యా, మహావిద్యా, శ్రీవిద్యా, షోడశాక్షరీ, నందివిద్యా**" వంటి ఎన్నో విద్యలగురించి తెలుసుకుంటాము (**విద్యా-అవిద్యా స్వరూపిణీ**)! "**అవ్యాజ కరుణామూర్తి**" అయినా, అవసరమైతే శత్రువులతో అస్త్ర-శస్త్ర యుద్ధాలు (భండాసుర వధ - **సంహృతాశేష పాషండా**) చేయాల్సి వస్తుంది (**దండనీతిస్థా**). ఉద్యానాలు, కోటలు, ఆవరణలు ఏర్పరుచుకోవటం ఉంటుంది. ధన-ధాన్యాలు సంపాదించుకుని (**ధనధాన్య వివర్ధినీ, అన్నదా, వసుదా**), వాటితో ఆయాయా ఆవరణల బలగాలకీ, దేవతలకీ విందు భోజనాలూ (**పాయసాన్నప్రియా, స్నిగ్ధౌదనప్రియా, గుడాన్న ప్రీత మానసా, దధ్యన్నాసక్త హృదయా, ముద్గౌదనాసక్తచిత్తా, హరిద్రాన్నైక రసికా, సర్వౌదనప్రీతచిత్తా, మహాగ్రాసా, మహాశనా**), పానీయాలూ (**మధుప్రీతా, మాధ్వీపానలసా, మత్తా**), కర్పూరవీటికా తాంబూలాలూ (**కర్పూరవీటికామోద సమాకర్షద్దిగంతరా, తాంబూలపూరిత ముఖీ**) సమర్పిస్తాము. ఆటలూ-పాటలూ ఉంటాయి (**లాస్యప్రియా, గానలోలుపా, కావ్యాలాప వినోదినీ**). తదుపరి రోగాల ప్రసక్తి (**సర్వ వ్యాధి ప్రశమనీ, రోగపర్వత దంభోళి**), ఆపదల ప్రసక్తి (**సర్వాపద్వినివారిణీ, సర్వమృత్యునివారిణీ, అనాదినిధనా, మృత్యుమథనీ, మృత్యుదారుకుఠారికా**), సుఖ-దుఃఖాలూ, ఆచార-అనాచారాలు, సాంప్రదాయాలూ, యోగాభ్యాసాలు (**బ్రహ్మ-విష్ణు-రుద్ర గ్రంథ విభేదినీ, కుండలినీ**), - శక్తిపీఠ పుణ్యక్షేత్ర దర్శనాలు (**జాలంధరమూ, ఓడ్యాణమూ,**

**వగైరా**). ఇలా వెళ్ళగా వెళ్ళగా ఈ జగత్తంతా ఆమెచే కల్పింపబడిన మిథ్య మాత్రమేనని (**మిథ్యా జగదధిష్ఠానా**), ఇదో విష్ణుమాయయని (**విష్ణుమాయా**), అమ్మని బహిర్ముఖంగా దర్శించటం అసాధ్యమనీ (**అవ్యక్తా, అదృశ్యా, దృశ్యరహితా, బహిర్ముఖ సుదుర్లభా**) గ్రహిస్తాము. జ్ఞానోదయమౌతుంది (**భవరోగఘ్నీ, అజ్ఞానధ్వాంత దీపికా, జ్ఞానగమ్యా, సత్యజ్ఞానానందరూపా**). తదుపరి, నిర్వాణసుఖాన్ని సుఖంగాఅనుగ్రహించే ఆ తల్లిని (**నిర్వాణసుఖదాయినీ**) అంతర్ముఖ తపస్సుతోనే దర్శించుకోగలమని (**అంతర్ముఖ సమారాధ్యా**) తెలుసుకుని, అదే ముక్తిమార్గమని గ్రహించి (**ముకుందా, ముక్తినిలయా, ముక్తిదా, ముక్తిరూపిణీ**) శివైక్యం పొందగలిగే దిశలో ప్రయాణం చేయటం – (ఇక్కడ చెప్పలేకపోయి ఇంకా చాలా ఉన్న విషయాలతో సహా) ఇదంతా స్థితి వైభవం. మొదలు నుంచి చివరివరకూ కార్యక్రమమంతా కలిపితే, సృష్టి–రక్షణ–నాశ–తిరోధాన–అనుగ్రహాలనబడే పంచకృత్యాలు (**పంచకృత్య పరాయణా**). భాస్కరరాయలు రచించిన సౌభాగ్య భాస్కరం అనే భాష్యంలో ఎన్నో వివరణలు విపులంగాలభిస్తాయి. జి.ఎల్.ఎన్. శాస్త్రిగారు రచించిన "శ్రీ లలితా సహస్రనామ వివరణము"లో గూడా చాలా వివరాలున్నాయి.

జగత్తుని ఇలా నడిపించే "**లోకయాత్రా విధాయినీ**", "**విశ్వభ్రమణకారిణి**" అయిన ఆ యమ్మకి ఈ సృష్టి–స్థితి–లయ ప్రక్రియలంతా ఒక లీల. అందుకని "**లలితాంబికా**" అని చిట్టచివరి నామం (లలితే అసౌ లలితా). సృష్టి–స్థితి–లయాలతో ఆనందంగా ఆడుకునే ఓ తల్లీ – నీకు నమస్కారం!.

(ఈ వ్యాసం టి.టి.డి. వారి "సప్తగిరి" డిసెంబర్ 2010 పత్రికలో ప్రచురింపబడింది.)

## అధ్యాయము 02

# శ్రీ స్వాధీన వల్లభా, సామరస్య పరాయణా

నా చిన్నతనంలో, హైస్కూల్ రోజుల్లో, అదేదో పత్రికలో "భర్తని లొంగదీసుకోవటం ఎలా?" అని వ్యాసాలు వచ్చాయి. అప్పట్లో పెద్దగా అర్థంగాకపోయినా, ఆ వ్యాసాలు చదివి అందరం నవ్వుకునేవాళ్ళం. "భార్యని లొంగదీసుకోవటం ఎలా?" అనే వ్యాసాలుగూడా వస్తాయేమోనని ఎదురు చూసిన కొంతమంది భర్తలు ఉండవచ్చుగానీ, అలాంటి వ్యాసాలు మాత్రము ఎప్పుడూ వచ్చినట్లుగా లేదు. దీనికి రెండు కారణాలు ఉండవచ్చు. ఒకటి: అలా వ్యాసాలు వ్రాస్తే ఆ మగాణ్ణి వాని భార్య ఉతికి ఆరేసేస్తుందేమో అనే భయం. రెండు: సాధారణంగా ఇటువంటి పత్రికలు ఎక్కువగా ఆడవాళ్ళే కొంటూంటారు కాబట్టి, "భార్యని లొంగదీసుకోవటం ఎలా?" అనే వ్యాసాలు ప్రచురిస్తే ఆడవాళ్ళు ఆ పత్రికని కొనటం మానేయువచ్చు. అప్పుడు ఆ పత్రికకి నష్టం వస్తుంది. ఏదేమైనా, అమ్మవారు అలాంటి వ్యాసాలు చదవకుండానే **"స్వాధీన వల్లభా"** అనిపించుకుంది. అంటే "భర్తని తన అధీనంలో పెట్టుకున్న తల్లీ" అని అర్థం. ఆ మహాతల్లికి ఈ గుణముండడమేమిటి అని ఈ నామం చాలా విచిత్రం అనిపిస్తుంది.

పాఠకులు గ్రహించే ఉంటారు. పరమశివుడూ, మహావిష్ణువూ ఇద్దరూ ఇల్లరికం వెళ్ళినవారే. ఒకాయన నివాసం మామగారింటి కైలాసం మీద, మరో ఆయన శయనం సాగరం మధ్యలోను. సరస్వతీదేవి మాత్రం బ్రహ్మగారి "తలలో నాలుక"గా మిగిలిపోయింది.

ఒక్క విషయం జ్ఞాపకముంచుకోవాలి. సాధారణంగా భర్తలు బాగా వృద్ధి పొందినా, వృద్ధిలోకి వస్తున్నా ముందర సంతోషించేది వాళ్ళ భార్యలు. అసలు వృద్ధియే లేని భర్తలు తమ స్వాధీనంలో ఉన్నా లేకపోయినా భార్యలు పెద్దగా పట్టించుకోకపోవచ్చు. ఎందుకంటే వృద్ధిలేని భర్తలు

తమంతట తామే భార్యాధీనులై ఉండిపోతారు, భార్యలు ప్రత్యేకించి స్వాధీనపరుచుకునే యజ్ఞాలు చేయక్కరలేదు. భర్తలు పెద్ద అధికారులో ధనవంతులో రాజకీయనేతలో అయితే మాత్రం భార్యల హుషారు గొప్పగా ఉంటుంది. ఇది సహజం, పెద్దగా తప్పు పట్టవలసినదేమీ లేదు. కానీ ఈ సందర్భాలలో భర్తల విధినిర్వహణలకి భార్యలు దూరంగా ఉండక, తాము అనవసరంగా కలగచేసుకోవటం కూడా జరుగుతూంటుంది, అది ప్రమాదం. అవసరమయి కలగచేసుకుంటేనే అది మంచికి దారి తీస్తుంది.

అమ్మవారి "**స్వాధీన వల్లభా**" అనే నామం ఇటువంటి సందర్భాన్నే సూచిస్తుంది. తన భర్త ఏమీ సామాన్యుడు గాడు. పైకి మాత్రం మెడలో ఒక సర్పాన్ని మాలగా వేసుకునీ, చేతిలో ఒక పుర్రెని పట్టుకునీ, ఒళ్ళంతా బూడిద రాసుకుని శ్మశానాలలోనో, లేక మంచుకొండలమీద బట్టలుగూడా లేకుండా దిగంబరుడై  ఉన్నట్లుగానో కనిపిస్తాడుగానీ, అతనంతటి మహిమాన్విత మహాదేవుడు మరొకడు లేడు. సకల ఐశ్వర్యాలకు అధిపతి, అయినా అన్నిటినీ ఇతరులకిచ్చేసి తను మాత్రం కళ్ళు మూసుకుని, తనకేమీ పట్టనట్టుగా చిద్విలాసంగా మనోన్మనుడయి తపస్సు చేసుకుంటూ ఉంటాడు. ఆయన సకల భూతేశుడేగానీ, సర్వ భూతదమనుడు గూడా. అమ్మ సమస్యల్లా అక్కడే వచ్చింది.

మనంకూడా ఇటువంటి సందర్భాలను ఎదుర్కుంటూ ఉంటాము. ఎవరినో తలుచుకుంటూ, "పైకి అలా కనిపిస్తాడుగానీ, తిన్నసైనవాడు కాదు, ఒక కంట కనిపెట్టుతూ ఉండాలిసుమా" అనుకుంటూ ఉంటాము. అమ్మగూడా అదేపని చేస్తూంది. కామేశ్వరీ కామేశ్వరుల అంశలే శివ పార్వతులు. అమ్మ ఏమో **స్వభావ మధురా**. మనకి తెలవకుండానేగూడా మనలని కాపాడే **గూఢగుల్ఫా**. అందుకని ఆమె **దయామూర్తి**. ఆ దయారూపమే **సాంద్రకరుణా**, అంటే కరడుకట్టిన కరుణ. బాంకులలోనూ, ట్రెజరీలలోనూ నోట్లకట్టలున్నా ధనప్రవాహం లేక ప్రజలకు చేరకపోతే ఉపయోగం లేనట్లుగా, దయ కరడు కట్టిపోయి ఉంటే మనకేమి లాభం! అందుకని ఆమె **కరుణాసాగరా** – ప్రవహించే కరుణ. ఆమె కరుణ ప్రవహించటానికి

కారణమంటూ ఉండాలా? అక్కరలేదు. ఆమె **కార్యకారణనిర్ముక్తా** కాబట్టి **అవ్యాజకరుణామూర్తి**. మరి ఆమెకి ఎప్పుడూ కోపం రాదా? రాదు; ఆమె **నిష్క్రోధా** – కోపం లేదు. మరొకరికి కోపం వచ్చిందా అదికూడా సహించదు – **క్రోధశమనీ** గదా! ఆమె భర్త? ఆయనకూడా పరమదయామూర్తియే అయినా, ఆయనకి ఎప్పుడైనా కోపం వచ్చిందా మనం తట్టుకోలేము. దేవతలుగూడా తట్టుకోలేరు. ఆయన రుద్రుడు. పదకొండు రకాలగా ఈ భూమిమీద, ఆకాశంలో, అంతరిక్షంలో విహరిస్తూంటాడు. ఆయనలేని చోటు ఏదైనా ఉందా అంటే, లేదు – "యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో రుద్రో విశ్వా భువనావివేశ" – అన్నిచోట్లా ఉంటాడని రుద్రం తెలియజేస్తూంది. అంతేకాదు. ఆయనకి కోపం వస్తే ఏమిచేయగలడోగూడా రుద్రం చెప్తూంది: "నమో రుద్రేభ్యః యే పృథివ్యాం యే అంతరిక్షే యే దివి యేషాం అన్నం వాతో వర్షమిషవః" । అంటే ఈ భూమిమీద, అన్తరిక్షమందు, దివ్యలోకాలలోనూ తిరుగుతూ, ఆహారం, గాలి, వర్షము అనే బాణాలను వాడుతూ పాపాత్ములని శిక్షిస్తూంటాడు – అని రుద్రం చెప్తూంది. పాపాత్ములకి తిండి లేకుండా పోవటమో, దుమారాలూ, తుఫాన్లూ వచ్చి ప్రాణాలూ ఆస్థులూ కొట్టుకుపోవటమో, అతివృష్టి–అనావృష్టిలకి గురికావటమో జరుగుతుంది. తన భర్తకి కోపం వస్తే ఎవరు ఏవిధంగా తిండిలేక మాడిపోతారో, ఏ గాలికి కొట్టుకుపోతారో, ఏ వూళ్ళో ఎవరి కొంపలు ములిగిపోతాయో! లోకమేమయిపోతుందో! అమ్మకి ఇదే చింత.

తను స్వయంగా ఇదివరలో చూసిందిగదా! మంచి చేయబోయి వచ్చిన మన్మథుడిని చూసి కాల్చి బూడిద చేశాశాడు ఆయన. (ఈ లక్షణంతోనే రుద్రాంశ సంభూతుడైన హనుమంతుడు కూడా చూసిరమ్మంటే కాల్చివచ్చాడు). తనుగానీ అప్పుడు కలగచేసుకుని బూడిదయిపోయిన మదనుడిని మళ్ళీ బ్రతికించి, ఇంకెప్పుడూ ఎవరికీ కనపడకుండానే నీ బాణాలేవో నువ్వు వేసుకుంటూండు అని ఆశీర్వదించకపోయుంటే ఈలోకంలో ఇక ప్రేమలూ, పెళ్ళిళ్ళూ ఉండేవే గావు. **హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవినీ ఔషధిః** – కాముడికి సంజీవినీ ఔషధి అయి అతనిచేత

ఇప్పటికీ పూజింపబడుతున్నది, అందుకనే – **కామపూజితా**. లోకాలకి విపత్తులు కలగకుండా చూడాలని, భర్త తన మూడోకన్ను తెరుస్తాడేమోనని తను కనురెప్పలుగూడా మూయకుండా ఉంది. **ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః** – ఆమె కన్నురెప్ప మూసిందంటే భువనాలకి ఘోరవిపత్తులుట. ఆయన కన్ను తెరుస్తే భయం, ఈమె కన్ను మూస్తే భయం, మనకి.

అందుకని భర్తని ఒక కంట కాదు, ఒక ఒంటంతా కనిపెట్టుతూ ఉండాలిసుమా అనుకుని అర్ధనారీశ్వరి అయింది – **శ్రీకంఠార్ధశరీరిణీ, కాంతార్ధ విగ్రహా**. ఆయన కోపాన్ని చల్లార్చుతూ, ఎట్టి పరిస్థితులలోనూ తనులేకుండా ఆయన ఏమీ చేయలేనట్లుగా, తనే శక్తిరూపిణి అయి, "శివః శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం, న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి .." అని సౌందర్య లహరిలో కీర్తింప చేసుకుంది. అందరినీ అన్నిటినీ ఉల్లంఘించి శాసించగలిగిన ఆ తల్లి **సర్వానుల్లంఘ్యశాసనా**. ఆ విధంగా భర్త విధినిర్వహణలలో తనూ పాల్గొంటూ, లోకక్షేమార్థం "**స్వాధీన వల్లభా**" అనిపించుకుంది. ఇక చింత లేదు; ఆమె **నిశ్చిన్తా** కూడా!

ఈ నామంలో పైకి తెలవని ఒక విశేషం ఉంది. సాధారణంగా మనం చేసే ప్రార్థనలన్నీ "నాకు ఆ పని చేసిపెట్టు, ఉద్యోగముండేలా చూడు, నాకు జయం చేకూర్చు, నన్ను ఉద్ధరించు" అనేవిధంగా ఉంటాయి. ఇతరులకి మంచి జరిగేలా చూడు అనిచేసే ప్రార్థనలున్నా, అవి తక్కువ. ఎక్కువగా మనకోసమే మన ప్రార్థనలు మన పూజలు. "నాకు, నాతోపాటు తల్లిదండ్రులకీ, పిల్లలకీ, పిల్లల పిల్లలకీ, ఈ ఊరికీ, ఈ ఊరి ప్రజలకీ, పశువులకీ, పాడి పంటలకీ, దేశానికి, సర్వ జగత్తుకీ శుభం జరిగేలా చూడు" అని చేసే ఏకైక ప్రార్థన (నాకు తెలిసినంతవరకూ) రుద్రంలోని నమకం. "యథా నస్సర్వమిత్ జగదయక్ష్మగ్ం సుమనా అసత్" – అని రుద్రం. అటువంటి విశాలహృదయ ప్రార్థనకి సాటి రాగలిగినది ఈ "**స్వాధీన వల్లభా**" అనే నామం. తన భర్తకి దయాహృదయముండేలా

చూడమంటూంది. ఎంత మంచి మాట చెప్పినా భర్త విననటువంటి సందర్భాలలో భార్యచేసే ఈ నామజపం భార్యాభర్తలిద్దరికీ వారి కుటుంబానికీ మంచి ఫలితాలను ఇస్తుంది. **సామరస్య పరాయణా** అన్న నామం భార్యకోసం భర్త, భర్తకోసం భార్య తపస్సుచేసి, సామరస్యాన్ని సంపాదించుకుని పూజనీయులవటాన్ని సూచిస్తుంది. కోరిన వ్యక్తితో వివాహం అవాలనీ, వివాహం తదుపరి అనుకూల దాంపత్యం కోసమనీ రుక్మిణీ కల్యాణం పారాయణ చేయమని పెద్దలు చెప్తూంటారు. అదే ఫలితాన్ని ఈ రెండు నామాల జపం సిద్ధింప చేయగలదు.

అధ్యాయము 03

# శ్రీ సరస్వతీ, శాస్త్రమయీ, శాస్త్రసారా

(మనస్తత్త్వ శాస్త్రము s ఈతిబాధలు)

శ్రీ లలితా సహస్రం అమ్మని "**విజ్ఞాన ఘనరూపిణీ", విజ్ఞాత్రీ, విజ్ఞాన కలనా, శాస్త్రమయీ, శాస్త్రసారా** అని కీర్తిస్తూంది. సప్తశతి(11) "విద్యాః సమస్తాః తవ దేవి" –సమస్త విద్యలు నీవేనమ్మా అని స్తుతిస్తూంది. ఆ శాస్త్రాలేమిటి, ఆ విజ్ఞానం ఏమిటి? లలితా సహస్రంలో చాలా శాస్త్రాల ప్రసక్తి సూక్ష్మంగా ఉంది. మరో అధ్యాయంలో సహస్రనామాలలో దాగున్న శబ్ద–నాద–వాక్ శాస్త్రం గురించి పరిశీలిద్దాం. మనస్తత్త్వ శాస్త్రం సహస్రనామాలలో ఎంత విపులంగా ప్రతిబింబించిందో ఈ అధ్యాయంలో పరిశీలిద్దాం. మానవ జన్మ, జన్మాంతరాలు, సుఖదుఃఖాలు, మనస్స్థితి గురించినది మనస్తత్త్వ శాస్త్రం. ఈ శాస్త్రం ఏమి చెప్తూన్నదో క్లుప్తంగానైనా ముందర తెలుసుకోవాలి.

శాస్త్రం గురించి ఇక్కడ చెప్పే కొన్ని విషయాలు, ముక్తినూతులపాటి గోపాలకృష్ణ శాస్త్రి గారు అనేకగ్రంథాలపై ఆధారపడి రచించిన, వావిళ్ళ

వారు ప్రచురించిన, "మనస్తత్త్వ శాస్త్రము" అనే గ్రంథం నుంచి గ్రహింపబడ్డాయి.

మనస్సు, వాక్కు, కర్మ అనేవి త్రికరణాలు. ఈ మూడు ఏకోన్ముఖమైనపుడు త్రికరణ శుద్ధి కలుగుతుంది. మహాత్ములు ఏమిచేసినా త్రికరణ శుద్ధితో చేస్తారు. అవిద్యా, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశములని పంచ క్లేశాలు. దుఃఖాలు ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవికములు అని మూడు రకాలు. ఇవే తాపత్రయాలు. ఆధి అంటే దెబ్బలు, బాధలు. ఆధ్యాత్మికాలు అనగా శారీరికంగా, మానసికంగా తనవల్లనే తనకి కలిగే జ్వరాది బాధలు. ఆధి భౌతికాలు అనగా పరులవల్ల, అంటే జంతు, పశు, పక్షి, పరమానవుల వలన కలిగే బాధలు. ఆధి దైవికాలు అనగా దైవికంగా, అతివృష్టి, అనావృష్టి, తుఫాను, భూకంపం వగైరాల వల్ల కలిగే బాధలు. వి+ఆధి=వ్యాధి అంటే ఏ కారణంగానైనా కలిగే విపరీత బాధ. అమ్మ **సర్వవ్యాధి నివారిణీ**. అన్నిరకాల బాధలనీ నివారిస్తుంది.

కర్మలూ, బాధలూ సుఖ–దుఃఖ హేతువులు. ఈ బాధలూ, సుఖ–దుఃఖాలూ ఎందుకు కలుగుతాయి? "సుఖస్య దుఃఖస్య న కోపి దాతా, పరో దదాతీతి కుబుద్ధిరేషా" – అని గరుడ పురాణం. ఎవరో కలగచేస్తున్నారనుకోవటం దుర్బుద్ధి అవుతుంది. ఇదంతా స్వకర్మఫలం తప్ప మరేమీ కాదు. వీటినుంచి విముక్తి పొందాలంటే **దుఃఖహన్త్రీ, సుఖప్రదా, సుఖకరీ** అయిన **దుర్గా** అమ్మవారిని ఆశ్రయించాలి. ఆమె **దౌర్భగ్యతూల వాతూలా, భాగ్యాబ్ధి చంద్రికా** – గాలికి గడ్డిపోచలెగిరిపోయినట్లు దౌర్భాగ్యాలని పోగొట్టి, వెన్నెలకి సముద్రాలు పొంగిపోయినట్లు భాగ్యవృద్ధి కలగచేస్తుంది.

సుఖదుఃఖాలు వస్తూంటాయి, పోతూనూ ఉంటాయి. ఎల్లపుడూ సుఖమే ఉండాలి అనుకోవటం రాగం అవుతుంది. ఆ రాగం అధికమయితే తృష్ణగా మారుతుంది. తృష్ణ కూడా ఒకరకమైన వ్యాధి. అనురాగం ఎక్కువైతే అభిమానం అవుతుంది. అభిమానం రెండు రకాలు. ఒకటి: నేను, లేక నేనే

అనుకునే "అహం"కారం. రెండు: నాది, అంతా నాదే అనుకునే "మమ"కారం. ఈ రెండూగూడా భవబంధాలకి దారి తీస్తుంది. ఈ మాన–అభిమానాలకి ఐదు జన్మస్థానాలున్నాయి (మను స్మృతి): (1) విత్తం (2) బంధువులు (3) వయస్సు (4) కర్మ (చేసే ఉద్యోగం వంటిది) (5) విద్యా. బాగా ధనం ఉన్నా, ప్రఖ్యాత బంధువులున్నా, మంచి వయసులో ఉన్నా, పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నా, పై–పై చదువులున్నా అవి దురభిమానాలకి దారి తీయగలవు. ఇవన్నీ కర్మానుసారం వచ్చేవి, జరిగేవి.

మనం ఎలాంటి కర్మలు చేస్తూంటాము? ఈ యీ కర్మలు చేయి అని ఎవరు నిర్ణయిస్తారు? "వాసయతి కర్మణా యోజయతి జీవమనాంసి" అని శాస్త్రం. జీవుల మనస్సులను కర్మలచేత జతకలిపేది "వాసన". అంటే మనకుండే "వాసనలు" బట్టి మన మనస్సులో ఆలోచనలు కలిగి, ఆ విధంగా కర్మలలో ఇరుక్కుంటాం. "వాసన" అనేది కొంత విచిత్రమైన పదం. "వాసనా"–భావాన్ని అవగాహన చేసుకోవటానికి చిన్న ఉదాహరణతో ప్రయత్నం చేద్దాం. చెరుకు తీయగా ఉంటుంది. అది పంచదార అయినప్పుడు, చెరుకు ఇంకా ఉందా? చెరుకు లేదుగానీ, ఇప్పుడు కొత్తగా తయారైన పంచదారలో పాతకాలపు తీపి ఉండిపోయింది. ఆ పంచదారని పాలలో కలిపాము. పంచదార ఇంకా ఉందా? పంచదార లేదుగానీ, ఇప్పుడున్న పాలలో అదే తీపి ఉండిపోయింది. ఆ పాలతో కాఫీ చేశాము. పాలు ఇంకా ఉన్నాయా? పాలు లేవుగానీ, ఇప్పుడున్న కాఫీలో అదే తీపి ఇంకా ఉండిపోయింది. తీపి అనే గుణం తను ఇంతవరకూ ఆశ్రయించుకుని ఉన్న పదార్థం మారిపోతున్నా, అది మాత్రం వదలట్లేదు. తరువాత వచ్చే పదార్థాలని ఆశ్రయించుకుంటూనే ఉండిపోతూంది. "వాసన" అంటే అదే. చింత చచ్చినా పులుపు చావలేదు – అనే మాట జన్మ–జన్మాన్తర కర్మ రహస్య సిద్ధాన్తం. క్రితం జన్మలలో అంటించుకున్న ఎన్నో రకాల గుణాలని అప్పటికప్పుడు వదుల్చుకోలేకపోతే, ఆ శరీరాలని వదిలేసినా ప్రస్తుత శరీరాలని అవి ఆశ్రయించుకునే ఉంటాయి. ఇప్పుడుకూడా వదుల్చుకోలేకపోతే, ఈ శరీరం వదిలేసినా ఆ యా యా గుణాలు వచ్చే జన్మల శరీరాలను ఆశ్రయించుకుని ఉంటాయి.

ఈ వాసనలే మన మనసులనీ ఆలోచనలనీ ప్రభావితం చేసి మనం చేసే కర్మలని ఏ జన్మకి ఆ జన్మలో నిర్ణయిస్తాయి.

వాసనలు రెండు రకాలు – శుద్ధ వాసనలు, మలిన వాసనలు. శుద్ధ వాసనలు మరల మూడు రకాలు: (1) అమానిత్వాది జ్ఞాన సాధనలు (ఇవి 20 రకాలు), (2) అభయ సత్త్వ సంశుద్ధ్యాది దైవ సంపదలు (ఇవి 26 రకాలు), (3) మైత్ర్యాది వాసనలు (ఇవి 4 రకాలు). మలిన వాసనలు కూడా మూడు రకాలు: లోక, శాస్త్ర, దేహ వాసనలు.

**శుద్ధ వాసనలు** తత్త్వ జ్ఞానం కలిగిస్తాయి:
అమానిత్వాది జ్ఞాన సాధనలు: (1) అమానిత్త్వం (2) ఆదంభిత్త్వం (3) అహింసా (4) క్షాన్తి (5) ఆర్జవం (6) ఆచార్యోపాసనం (7) శౌచం (8) స్థైర్యం (9) ఆత్మ వినిగ్రహం (10) ఇన్ద్రియ విషయ వైరాగ్యం (11) అనహంకారం (12) జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనం (13) ఆసక్తి–అనాసక్తి (14) అనభిష్వంగం (15) సమచిత్తం (16) అవ్యభిచరిత భక్తి (17) వివిక్త దేశ సేవిత్త్వం (18) అరతిర్జన సంపది (19) అధ్యాత్మ జ్ఞాన నిత్యత్త్వం (20) తత్త్వజ్ఞాన అర్థ దర్శనం.

అభయ సత్త్వ సంశుద్ధ్యాది దైవ సంపదలు: (1) అభయం (2) సత్త్వ సంశుద్ధి (3) జ్ఞానయోగ వ్యవస్థితి (4) దానం (5) దమం (6) యజ్ఞం (7) స్వాధ్యాయం (8) తపస్సు (9) ఆర్జవం (10) అహింస (11) సత్యం (12) అక్రోధం (13) త్యాగం (14) శాన్తి (15) అపైశునం (16) భూతదయ (17) అలోలత్త్వం (18) మార్దవం (19) హ్రీ (20) అచాపలం (21) తేజస్సు (22) క్షమ (23) ధృతి (24) శౌచం (25) అద్రోహం (26) అతిమానిత్త్వం

మైత్ర్యాది వాసనలు: (1) మైత్రి (2) కరుణ (3) ఉపేక్ష (4) ముదిత. **మైత్ర్యాది వాసనాలభ్యా** అని అమ్మ నామం.

**మలిన వాసనలు** తత్త్వ జ్ఞానం కలిగించలేవు:

(1) లోక వాసనలు: మా ఊరు, మా సంస్కృతి, మా సాంప్రదాయం, మా ఆచారం అనుకునే భావనలు.
(2) శాస్త్ర వాసనలు: (ఎ) జీవిత కాలమూ అధ్యయనం చేస్తూనే ఉండాలి అనే పాఠ వ్యసనం, (బి) అన్ని శాస్త్రాలూ తెలుసుకోవాలి అనుకునే బహుశాస్త్ర వ్యసనం, (సి) గృహస్థాశ్రమమందే ఉంటూ అన్ని కర్మలనూ ఆచరించాలనుకునే అనుష్ఠాన వ్యసనం.
(3) దేహ వాసనలు: (ఎ) దేహాత్మత్త్వ భ్రాన్తి: దేహమే ఆత్మ అనుకోవటం, (బి) దోషాపనయన భ్రాన్తి: లౌకిక లేక బాహ్య శుద్ధులయందు ఆసక్తి, (సి) లౌకిక గుణాధాన భ్రాన్తి: బాహ్యాలంకారాలతో ఆకర్షణీయంగా ఉండాలి అనే భావన, (డి) శాస్త్రీయ గుణాధాన భ్రాన్తి: తీర్థ స్నానాదుల మాత్రంచేత పావనులమైపోగలమనే భావన.

వాసనలను ఎలా పసిగట్టవచ్చు? వాటివల్లనే ప్రభావితులమయి మనం చేసే కర్మలలో కామ–క్రోధ–లోభ–మోహ–మద–మాత్సర్యాల రూపంగా అవి దర్శనమౌతాయి. ఇవే అరి షడ్వర్గాలు. అరి అంటే శత్రువు. వీటిలో కామ–లోభ–మోహాలు (పైన చెప్పిన) రాగం వలనా, క్రోధ–మద–మాత్సర్యాలు (రాగానికి వ్యతిరేకమైన) ద్వేషం వలన ఉద్భవిస్తాయి. కామం, ద్వేషం, మోహం మూడు రకాల మానసిక దోషాలకి కారణమయి, జనన మరణ, సంసార బంధాలు కలుగచేస్తున్నాయి. మదం కూడా దోషమే. ధన మదం, కుల మదం, రూప మదం, బల మదం, ఐశ్వర్య మదం, విద్యా మదం వగైరాలే కాక మరో 18 దోషాలను ఇతిహాస పురాణాలు పేర్కొంటున్నాయి.

పైన చెప్పినదంతా శాస్త్రం. ఇప్పుడు అమ్మ సహస్ర నామాలను పరిశీలించండి: "**నీరాగా, రాగమథనీ, నిర్మదా, మదనాశినీ, నిశ్చింతా, నిరహంకారా, నిర్మోహా, మోహనాశినీ, నిర్మమా, మమతాహన్త్రీ, నిష్పాపా, పాపనాశినీ, నిష్క్రోధా, క్రోధశమనీ, నిర్లోభా, లోభనాశినీ, నిర్భవా, భవనాశినీ, నిరాబాధా, నిర్భేదా, భేదనాశినీ, దుఃఖహన్త్రీ, సుఖప్రదా, సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా, భవరోగఘ్నీ, తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా, దురాచారశమనీ, దోషవర్జితా, సర్వవ్యాధి**

**నివారిణీ, సమానాధిక వర్జితా, హేయోపాదేయ వర్జితా, మైత్ర్యాది వాసనాలభ్యా, యజ్ఞకర్త్రీ, మనోన్మనీ, మనోన్మయీ, మనస్వినీ, మానవతీ, విరాగిణీ, శుద్ధమానసా**", ఇలా మనస్తత్త్వ శాస్త్రానికి సంబంధించి అమ్మ నామాలు చాలానే ఉన్నాయి. ఈ ఈతిబాధలు లేకుండా ఉండాలంటే మనకి జనన మరణ సంబంధ పాశాలనుంచి విముక్తి కలగాలి. ఆ ముక్తినిచ్చేది **మహాపాతక నాశినీ, పాపారణ్య దవానలా, ముకుందా, ముక్తిదా, ముక్తిరూపిణీ, బంధమోచనీ, పాశహన్త్రీ** అయిన అమ్మవారే. ఆమేయే **భవారణ్యా కుఠారికా, భవదావ సుధావృష్టిః, మృత్యుమథనీ, మృత్యుదారు కుఠారికా, సర్వమృత్యు నివారిణీ, జన్మ-మృత్యు-జరా తప్త జన విశ్రాన్తిదాయినీ.**

ఈ నామావళిలో ఒక పజిల్ దాగుంది. అమ్మకి రాగద్వేషాలు లేవు. అరిషడ్వర్గాలైన క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం వగైరాలు లేవు. అవి ఎవరికైనా ఉంటే వాట్లని శమింపచేసేస్తుంది, నశింపచేసేస్తుంది. మరి కామంకూడా మరో అరివర్గమే కదా! సహస్రనామాలలో **నిష్కామా** అన్న నామమే ఉందిగానీ, ఎక్కడా కామశమనీ అనో, కామనాశినీ అనో ఒక నామం ఎందుకులేదు? ఆమె **నిస్సంశయా, సంశయఘ్నీ**. ఈ విషయమై సంశయాలుంటే తీర్చేయాలి. ఈ విషయం "**ధర్మాధర్మ వివర్జితా**" అనే అధ్యాయంలో ఆలోచిద్దాం.

## అధ్యాయము 04

## శ్రీ పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ

**పరా - పశ్యన్తీ - మధ్యమా - వైఖరీ** అన్న అమ్మవారి నామాలు వాక్కుకి సంబంధించిన నాలుగు రకాల శబ్దాల గురించి తెలియచేస్తాయి. ఈ శబ్దాలను నాదములు అని చెప్పవచ్చు. "చత్వారి వాక్పరిమితా పదాని తాని

విదుర్బ్రాహ్మణా యే మనీషిణః, గుహా త్రీణి నిహితానేంగయంతి, తురీయం వాచో మనుష్యా వదన్తి" అని ఋగ్వేదంలో ఒక మన్త్రమున్నది(1–22–164). నాలుగు రకాల వాక్స్వరూపాలు ఉన్నాయిట. కానీ వాటిలో మూడు స్వరూపాలు "గుహ"లోనే ఉండిపోయి, నాలుగో స్వరూపమే బయటికి వినిపిస్తుంది. ఈ విషయం జ్ఞానులుమాత్రమే తెలుసుకోగలరు అని ఈ మన్త్రార్థము. ఈ శబ్దాలగురించి యాస్కుడు మరోలా వివరించాడు. సృష్టి మొదలైనప్పుడు, ఒక పెద్ద శబ్దము వచ్చి అది నాలుగు రకాలుగా విభజింపబడినది. ఒకభాగాన్ని సూర్యుడూ, మరోభాగాన్ని అగ్నీ, మరోభాగాన్ని వాయువూ హరించుకోగా, నాలుగో భాగాన్ని మాత్రమే మానవులు గ్రహించగలిగారు.

అసలు శబ్దాలు, నాదాలు, వాక్కులు ఎలా ఉద్భవించాయి, ఎలా ఉద్భవిస్తున్నాయి? "మాహేశ్వర సూత్రాలు" ద్వారా ఈ విషయాలపై కొంత అవగాహన మనకి కలుగుతుంది.

ఈ వివరణ తెలుసుకునే ముందర, మాహేశ్వర సూత్రాల గురించి కూడా తెలుసుకుందాం. ఒకనాటి సాయంకాలం సనకసనందనాది సిద్ధులూ, పాణిని మొదలయిన మునులూ, పరమాత్మ తత్త్వాన్ని పరమశివునినుంచే తెలుసుకుందామనుకూంటూ కైలాసానికి వెళ్ళారు. ఆ సమయంలో ఆ నటరాజు తాండవం చేస్తున్నాడు. కానీ ఆయనకి ఈవచ్చినవారు ఎందుకు వచ్చారో అర్థమయి, వారి కుతూహలానికి సమాధానంగా మొదట తొమ్మిది సార్లు, తరువాత మరల ఐదు సార్లూ, మొత్తం పదునాలుగు సార్లు తన డమరుకాన్ని వాయించాడు. ఆ పదునాల్కు మ్రోతలు పదునాల్గు శబ్ద సూత్రాలు (14 "మాహేశ్వర సూత్రాలు")గా పాణినికి అర్థమవగా, వాటి ఆధారంగా "అష్టాధ్యాయి" అనే 8 ఎనిమిది అధ్యాయాల వ్యాకరణసూత్రాలని రచించినాడు. అష్టాధ్యాయికి పతంజలి భాష్యమూ, యోగసూత్రాలూ వ్రాయటం జరిగింది. సనక సనందనాది సిద్ధులు తమకి సరిగా అర్థంకాలేదు అనుకుంటూ, నందికేశ్వరుని వివరించమని కోరగా, నందికేశ్వరుడు 28 శ్లోకాలలో వివరించాడు. వాటిలో 26 వివరణ శ్లోకాలు

"కాశికా" అని చెప్పబడుతూ, ఆత్మ-పరమాత్మ తత్త్వాలను ప్రబోధిస్తున్నాయి. కాశికలకు ఉపమన్యు మహాముని "తత్త్వ విమర్శిని" అని వ్యాఖ్యానము వ్రాయగా, దీనిని అక్షరజ్ఞుడు అనే మహాత్ముడు "ప్రణవ వల్లి" అనే పేరుతో తెలుగులోకి అనువదించాడు. కొంతకాలం క్రితము ఆంధ్రపత్రిక వారు "ప్రణవ వల్లి"ని ప్రచురించారు.

ఈగ్రంథాలను పరిశీలిస్తే శబ్ద-నాదోత్పత్తిల గురించి కొంత అవగాహన ఏర్పడుతుంది. ఇక్కడ ఇస్తున్న వివరణ ప్రణవ వల్లి నుంచి గ్రహించినదే. ఉదాహరణగా "అ ఇ ఉ ణ్" అనే మొదటి సూత్రాన్ని గ్రహిద్దాము. దీనికి సంబంధించిన కాశికా: "అకారో బ్రహ్మరూపస్స్యాత్ నిర్గుణ స్సర్వ వస్తుషు, చిత్కలాం ఇం సమాశ్రిత్య జగద్రూప ఉణీశ్వరః"। దీనికి చాలా పెద్ద వివరణ ఉందిగానీ, తేలికగా చెప్పాలి అంటే నిర్గుణ బ్రహ్మ ("అ"కారస్వరూపము), మాయ("ఇ"కార రూప చిత్కలా)ను పొంది, అన్నివస్తువలయందు సగుణ జగద్రూప ఈశ్వరుడుగ ("ఉ"కార రూప వ్యాప్తి చెంది) ఉన్నాడు - అని అర్థం. "సర్వ వస్తుషు" అన్నచోట పరా-పశ్యన్తీ-మధ్యమా-వైఖరీ లతో కలిపి 25 అనాత్మ తత్త్వాలు ఉన్నాయిట. ఇదే విధంగా మిగిలిన సూత్రాలకిగూడా తత్త్వజ్ఞాన సంబంధిత వివరణలు చెప్పబడ్డాయి.

**పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ** అనే శబ్దాల వివరణ కూడా ఇవ్వబడింది. **పరా**: సంకల్పము పుట్టుట, ప్రాణ స్వరూపము. ఇదే **పరాశక్తి**. **పశ్యంతీ**: సంకల్పమును వెలువరించుట, మనోరూపము. **మధ్యమా**: దంత తాల్వోష్ఠ వ్యాపారములతో గూడుట, ఇంద్రియ స్వరూపము. **వైఖరీ**: వినిపించేలా మాట్లాడుట, వినబడే వాక్స్వరూపము. పరా అన్నది వృక్షముల యందు, పశ్యంతీ అన్నది భూమి జలాదులందు, మధ్యమా అన్నది పశువులయందు కూడా ఉండగా, శబ్దరూపమైన వైఖరి అన్నది మానవులయందు ఉండునని వివరణ. ఈశ్వరుని ప్రాణచేష్ఠయే నాభియందు (మూలాధారమందు) పరా వలె పరిణామము చెంది, హృదయమందు పశ్యంతీ గా మారి, తదుపరి విశుద్ధియందు మధ్యమా గా మారి, చివరికి ముఖమందు వైఖరీ గా వ్యక్తీకరింపబడుతున్నది. మూలాధారమందున్న

వహ్నిమండలమందు సోమ–సూర్య–అగ్ని దేవతలుంటారు. ఈ దేవతలకీ, మన నోటికీ మధ్యలో వాయుదేవుడు ఉన్నాడు. అందుకనే "అగ్నిర్మే వాచిస్త్రిష్ఠతు" అని న్యాసం చేస్తాము (దీనిగురించి మరో అధ్యాయంలో మరికొంత ప్రస్తావన వస్తుంది), ఇదిగాక వాయుపుత్రుడైన ఆంజనేయస్వామిని వాక్పటుత్వం ప్రసాదించమని ప్రార్థిస్తాము. పైనచెప్పిన ఋగ్వేద మన్త్రానికీ, మాహేశ్వర సూత్రాలకీ, అనుసంధానమయి ఉన్నవి లలితా సహస్రంలోని ఈ నామాలు.

**పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ** అనే నాలుగు వాక్కులకి నాద బిందు కళలని పేరు. నాదానికీ, యోగశాస్త్రానికీ సంబంధముంది. పతంజలి యోగసూత్రాల గురించి పైన ప్రస్తావన జరిగింది. "శివ సంహితా" అనే గ్రంథంలో యోగాసనాలూ, యోగముద్రల వివరణ ఉంది. మహాముద్ర, మహాబన్ధ, మహావేధ, ఖేచరీ, జాలంధర, మూలబన్ధ, విపరీతకృతి, ఉద్దాన, వజ్రేణీ, శక్తిచాలనం అని పది ముద్రలు. ఇదిగాక యోనిముద్ర అనే ముద్రగురించిగూడా చెప్పబడింది. యోగాసనాలు, తత్సంబంధిత ముద్రలు సరిగ్గా చేయగలిగిన యోగులకు ఆహ్లాదకరమైన నాదం వినిపిస్తుందనీ, జ్యోతిస్స్వరూపంగా ఆత్మదర్శనం జరుగగలదనీ తెలియజేశారు. ఆత్మ స్వప్రకాశవంతమైన జ్యోతిస్వరూపము – "స్వప్రకాశో యతస్తస్మాదాత్మా జ్యోతి స్స్వరూపకః" । అమ్మకి "**దశముద్ర సమారాధ్యా, జ్ఞానముద్రా, యోనిముద్రా, త్రిఖండేశీ** " అనీ, "**నాదరూపా**", "**నాదరూపిణీ**" అనీ నామాలు ఉన్నాయి. ఈ వాక్–నాద రూపాలూ, రూపాంతరాలూ అన్నీ అమ్మ స్వరూపాలే అని ఈ నామాలు మనకి తెలియచేస్తున్నాయి. సప్తశతి (11) "కా తే స్తుతిః స్తవ్య పరా–అపరోక్తిః", అనగా పరా వాక్కూ, అపరా వాక్కులూ గూడా నీవే అవగా, ఇంక యే మా వాక్కులతో నిన్ను స్తుతిచేయగలము, అని విస్తుబోయింది.

వాక్కు మానవులకు మాత్రమే దక్కిన దైవప్రసాదం. దాన్ని సద్వినియోగం చేసుకోవాలి. **సత్యవ్రతా, సత్యరూపా,** అనే అధ్యాయంలో ఆ విషయం ఆలోచిద్దాం. మాటల వైఖరిని బట్టి మనోభావాలను తెలుసుకోవచ్చు.

"ఆకారై రింగితైర్గత్యా చేష్టయా భాషణేన చ, నేత్ర వక్త్ర వికారైశ్చ లక్ష్యతే అన్తర్గతం మనః – అని మనుస్మృతి. **"సరస్వతీ – శాస్త్రమయీ"** అనే అధ్యాయంలో మనస్తత్త్వ శాస్త్రం అమ్మ నామాలలో ఎలా ప్రతిబింబించిందో చూశాం.

అధ్యాయము 05

# శ్రీ ధర్మాధర్మ వివర్జితా, ధర్మిణీ, ధర్మాధారా, ధర్మవర్ధినీ

శ్రీ లలితా సహస్రంలోని కొన్ని నామాలు పజిల్స్ లాంటివి. కామ–క్రోధ–లోభ–మోహ–మద–మాత్సర్యాలనే అరి షడ్వర్గాలలో ఐదింటి గురించి **క్రోధశమనీ, లోభనాశినీ, మోహనాశినీ, మదనాశినీ, భేదనాశినీ, హేయోపాదేయ వర్జితా** అనిచెప్పి, ఎక్కడా కామశమనీ అనో, కామనాశినీ అనో చెప్పకపోగా పైగా, "**కామదాయినీ,** " అని కామాన్ని కలిగించేదీ, అనుగ్రహించేదిగా నామాలున్నాయి. ఇది చిత్రమే గదా!

అంతే కాదు. అనుకూలంగా ఒక నామముంటే, దానికి వ్యతిరేకంగా ఉన్నట్లు తోచే మరోనామం ఉంటుంది. ఉదాహరణకి "**(1) నిష్కామా, కామరూపిణీ, లోలాక్షీ కామరూపిణీ, (2) విద్యా, విద్యా–అవిద్యా స్వరూపిణీ, (3) నిర్గుణా, నిస్త్రైగుణ్యా, త్రిగుణాత్మికా, (4) రంజనీ, నిరంజనా, (5) కులాంగనా, అకులా, (6) నిరాకారా, వివిధాకారా, బహురూపా, (7) నిష్కలా, చిత్కలా, కలావతీ, కలాలాపా, కలాత్మికా, కలానాథా, కలానిధిః, (8) పరా, అపరా (9) ఈశ్వరీ, నిఖిలేశ్వరీ, మాహేశ్వరీ, పరమేశ్వరీ, నిరీశ్వరా, (10) నామరూప వివర్జితా, నామపారాయణ ప్రీతా, (11) వాగ్వాదినీ, దక్షిణామూర్తి రూపిణీ, (12) అవ్యక్తా, వ్యక్తావ్యక్త స్వరూపిణీ, ప్రకటాకృతిః, (13) మూర్తా, అమూర్తా,**

**(14) భావజ్ఞా, భావాభావ వివర్జితా, (15) అయోనిః, యోనినిలయా, (16) నిత్యతృప్తా, అనిత్యతృప్తా, (17) నిత్యయౌవనా, వృద్ధా** వంటి నామాలు పేర్కొనవచ్చు. నామాలలోని పదాలు వ్యతిరేకంగా ఉన్నట్లు కనిపిస్తాయి; కానీ భావవ్యతిరేకత లేదు. దేని భావం దానిదే.

ఇటువంటివే "**ధర్మాధర్మ వివర్జితా, ధర్మాధారా, ధర్మిణీ, ధర్మవర్ధినీ**" అనే నామాలుగూడా. ధర్మ–అధర్మములచే విడువబడినది అనో, లేక తనకు ఏ ధర్మ–అధర్మములూ లేవనో ఒకచోట చెప్పి, మరో నామంలో "**ధర్మిణీ**" అనీ, మరోచోట "**ధర్మవర్ధినీ**" అనీ, అసలు ధర్మానికి ఆధారం ఆమెయేనని చెప్పబడింది.

అమ్మవారి ఈ నామాలగురించి అవగాహన ఏర్పరుచుకునే ముందర నైజం – లక్షణం – ధర్మం, వీటిగురించిన చర్చ కొంత అవసరమినిపిస్తోంది. నైజమన్నది మన నిజస్వరూపం (అది మనకే తెలియకపోవచ్చు!). దాన్నిబట్టి మనకి కొన్ని లక్షణాలు ఏర్పడతాయి. ఉప్పు ఉప్పగా ఉండటం, పంచదార తీయగా ఉండటం వగైరా వాటివాటి లక్షణాలను మాత్రమే తెలియచేస్తాయి. ఉప్పగా ఉండకపోతే అది ఉప్పు గాదు; తీయగా ఉండకపోతే అది పంచదార గాదు. నైజం, లక్షణం అనేవి ఆ యా యా పదార్థాలనీ, మానవులనీ, పశు–పక్ష్యాదులనీ అవే అంటిబెట్టుకుని ఉంటాయి. కానీ ధర్మం అలా కాదు. ధర్మాధర్మాలని మనం అంటిబెట్టుకుని ఉండాలి. ధార్యతే ఇతి ధర్మః – అంటే మనచేత ధరింపబడేది. ధరిస్తామా లేదా అన్నది మన నిర్ణయం. ఉదాహరణకి అస్తేయం (దొంగతనం చేయకపోవటం) అందరికీ ఉండవలసిన ఒక సామాన్య ధర్మం. మనం అంటిబెట్టుకుని ఉండవలసిన గుణం మాత్రమే అది. అందరూ కచ్చితంగా అంటిబెట్టుకుని ఉండితీరతారని చెప్పలేము.

ధర్మం అనగా ఏమిటి అనే ప్రశ్నకి సమాధానమివ్వటం తేలికగాదు. దానికి సరిఅయిన మాట ఇంగ్లీషులో ఉన్నట్లుగా తోచదు. ఆ మాటని ఇంగ్లీషులో చెప్పవలసివస్తే "self governance" అని చెప్పవచ్చు. ఒక వ్యక్తి అవవచ్చు,

కుటుంబం కావచ్చు, సమాజమో, దేశమో, రాజో, సేవకుడో, తండ్రో, కొడుకో, తల్లియో, కూతురో, గురువో, శిష్యుడో, ఎవరైనా కావచ్చు. తనని (తమనీ) ఏ ప్రవర్తన సన్మార్గమందు నడిపి రక్షించగలదో అది ధర్మం.

స్మృతులలో రకరకాల ధర్మాలు చెప్పారు. అహింస, సత్యం, వగైరాలు ప్రతి మానవునికీ ఉండవలసిన సామాన్య ధర్మాలు అనీ, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకి వేరువేరుగా వర్ణాశ్రమ ధర్మాలు అనీ, చదువుకునే పిల్లలకి, గృహస్థులకి, వానప్రస్థులకి, సన్యాసులకి వేరువేరుగా ఆశ్రమ ధర్మాలు అనీ చెప్పారు. పురుష ధర్మాలు వేరు, స్త్రీ ధర్మాలు వేరు. కాలం కూడా ధర్మాధారమే. కృత, త్రేతా, ద్వాపర, కలి యుగధర్మాలు వేరువేరు. దానం కలియుగ ధర్మమని స్మృతి.

అమ్మ ఒక మనిషి కాదు, దేవత కాదు. ఒక స్త్రీయో, పురుషుడో కాదు, ఆమెకు ఒక కులమనీ, ఒక జాతి అనీ ఏమీ లేవు. ఆమె గృహిణీ కాదు, సన్యాసినీ కాదు. ఒక యుగంలో ఉండీ మరో యుగంలో లేకపోయినది గాదు. ఆమె "**వయోవస్థా వివర్జితా, సర్వావస్థా వివర్జితా**" వయసుతోనూ, అవస్థలతోనూ సంబంధమున్నది గాదు. వేదాలూ, జ్ఞానులూ అగ్నిలో, నీటిలో, ఆకాశంలో, భూమిమీద, వాయువులో, ఆమెను దర్శించుకున్నారు. ఓ భూమీ, ఓ నీరా, ఓ దీపమా, ఓ గాలీ, ఓ ఆకాశమా, మీరు మగవారా, స్త్రీలా – అని అడిగితే ఏం సమధానం వస్తుంది! వీటికి క్రింద పారేయడమో, కరిగించేయడమో, కాల్చేయడమో, విసిరిగొట్టేయడమో, ఇటువంటి లక్షణాలు ఉన్నాయిగానీ హింసా–అహింసా, స్తేయం–అస్తేయం వంటి ధర్మాధర్మాలు లేవు. "**మూల ప్రకృతి**" అయిన అమ్మకి ఇటువంటి ధర్మాధర్మాల ప్రసక్తి లేదు. అందుకని **ధర్మాధర్మ వివర్జితా**".

రాముడునీ, కృష్ణుడునీ గూడా అమ్మవారివంటి దేవతలుగానే పూజిస్తాము. కానీ ఒక పెద్ద తేడా ఉంది. రాముడు, కృష్ణుడు వంటి దేవతలు ధర్మాధర్మ వివర్జితులు గారు. "రామో విగ్రహవాన్ ధర్మః" అని కదా మారీచుడు చెప్పాడు. రామాయణము, భారతమూ కూడా

ధర్మాధార ఇతిహాస కావ్యాలు. కాబోతే ఈ రెండింటిమధ్య ధర్మాలలో పెద్ద వ్యత్యాసాలున్నాయి. మంథర చేస్తున్నది అధర్మం కాబట్టి చంపేయటం ధర్మమేనని లక్ష్మణుడనుకుంటే, అడవులపాలయి అష్టకష్టాలు పడ్డాడే గానీ చంపేయటానికి రాముడు ఒప్పుకోలేదు. అలసిపోయిన రావణుడిని చూసి, విశ్రాన్తి తీసుకుని రేపురా మళ్ళీ యుద్ధానికి అని ఇంటికి పంపేయటం రాముడి ధర్మం. భూమిలోకి దిగిపోయిన రథాన్ని ఎత్తుకుంటూండగా నాపై బాణప్రయోగం అధర్మం సుమా అని సాక్షాత్ పరమాత్మ అయిన కృష్ణుడికి బోధించటం కర్ణుడి ధర్మం.  త్రేతాయుగ రాముడు అధర్మానికికూడా ధర్మమే జవాబన్నట్లుగా ప్రవర్తించగా, అధర్మానికి అధర్మం జవాబు చేయవచ్చు అని ద్వాపరయుగ కృష్ణుడి అభిప్రాయం. బట్టలుతుక్కుని బ్రతికే ఓ రజకుడన్నమాటకి, గర్భిణీ స్త్రీ అనికూడా లెక్కబెట్టక భార్యని అడవిపాలు చేశాడు శ్రీ రామచంద్రమూర్తి. భార్య బట్టలూడపీకబోయారని తొడలు విరగగొట్టుతా, గుండెలు చీల్చి రక్తం త్రాగుతా అని భీమసేన శపథం. భరతుడు తనేగానీ శ్రీరామ పట్టాభిషేక వ్యతిరేకి అయ్యుంటే అన్నిరకాల అధర్మాలూ చేసిన పాపినౌతాను అని శపథం చేయగా, సూదిమొనంత భూమిగూడా పాండవులకి చెందదు అన్నది దుర్యోధన ధర్మం. అంతా నీదే, నీదే, నీదే అంటే అది రామాయణం ఔతుంది. అంతా నాదే, నాదే, నాదే అంటే అది భారతమౌతుంది. తనంతట తనుగానే వచ్చి శరణు వేడిన విభీషణుడిని తనపైపు తిప్పుకోవటం రాముడి ధర్మం. పట్టాభిషేకాన్ని, పట్టమహిషినీ ఎరగా చూపించి కర్ణుడిచేత ఫ్లోర్ క్రాస్ చేయిద్దామనుకోవటం కృష్ణుడి ధర్మం. మృగాలను కొట్టేప్పుడు షోకాజ్ నోటీసులిచ్చి చెప్పటం ఉండదని రాముడి వాదన. నమకస్థుడిచేత అబద్ధం చెప్పించైనా సరే, అడ్డొచ్చినవాడిని కొట్టేయవచ్చు అని కృష్ణుడి వాదన. ఇలా మారిపోతూ వచ్చిన ధర్మాధర్మాలమీదనే ఆధారపడి నడిచాయి శ్రీ రామచరిత్ర, కృష్ణలీలలు. మిగతా కథలు కూడా అంతే. ఒక విషయం. సామాన్య ధర్మాలు మాత్రమే శాశ్వతమైనవి. వర్ణాశ్రమ ధర్మాలకి శాశ్వతత్త్వం లేదు. **శ్రీమాత గుణాతీతా, లోకాతీతా, సర్వాతీతా** మాత్రమే కాదు. ఆమె అశాశ్వతమైన వాటితో సంబంధంలేని **శాశ్వతీ**. అందుకని **ధర్మాధర్మ వివర్జితా**".

స్త్రీలను ఎత్తుకుపోయి బలాత్కరించటం మా రాక్షసులకు ధర్మమేనని సీతమ్మతల్లితో రావణుడు వాదించాడు. హంతకుడుగూడా హత్యచేయటం ధర్మమేనంటాడు. దొంగలుకూడా దొంగతనం చేయటం ధర్మంగానే భావిస్తారు. అలాగే అన్నిరకాల నేరస్థులూ వాదిస్తారు. ఎవరికీ దుఃఖం కలిగించకుండా అందరికీ ఆమోదకరమయి ఉండేది ధర్మం. ఎవరికెంత దుఃఖం కలిగినా తమకి ఆమోదకరమైతే చాలు, అది ధర్మమే అంటారు నేరస్థులు. ఒక విషయం గ్రహించాలి. మనకు తోచినదల్లా ధర్మమే అవనక్కరలేదు. మనం జాగ్రత్తపడవలసినది, ధర్మం మాత్రమే మనకు తోచేలా చేసుకోవటం. సంధ్యావందనమన్త్ర రహస్యం ఉంది ఇక్కడ. సర్వలోకాలలోనూ అఖండ తేజస్సుతో వెలిగిపోతూ, మా బుద్ధులని ప్రేరేపించే ఓ పరమాత్మ స్వరూపమా, నిన్ను తలుచుకుంటున్నాము అని గాయత్రీ మన్త్రం చెప్పుతూంది. అయితే ఇక్కడ "ధియో యోనః ప్రచోదయాత్ – మా బుద్ధులని ప్రేరేపించే" అన్న మాటలో ధర్మాధర్మాల ప్రసక్తి లేదు. ఈ మాట వివరణ, గాయత్రీ మన్త్రానికి ప్రత్యామ్నాయంగా చెప్పే మరో సూర్యమన్త్రంలో ఉంటుంది: "యో దేవస్సవితాస్మాకం ధియో ధర్మాది గోచరాః, ప్రేరయేత్ తస్య యద్భర్గః తద్వరేణ్యం ఉపాస్మహే" – మా బుద్ధులకి ధర్మాధర్మాలు గోచరమయి మమ్ములను ప్రేరేపించే ఆ సవితృదేవుని ఉపాసిస్తాము. ధర్మం మాత్రమే మనకు తోచేలాచేసే అమ్మ **భానుమండల మధ్యస్థా, రవిప్రఖ్యా, గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ, సంధ్యా.**

అమ్మ నామాలలో **శృతిస్స్మృతిరనుత్తమా** అనే నామాలున్నాయి. విశ్వ–ప్రపంచ–సమాజ–వ్యక్తి శ్రేయస్సులనే లక్ష్యాలతో, మన ప్రవర్తనా విధానాలని రూపొందించే ధర్మాధర్మాలను స్మృతులు వివరించాయి. ఈ సువిశాల భారతదేశంలో ఎన్నో ప్రాంతాలు, ఎన్నో భాషలూ, సాంప్రదాయాలూ, ఉన్నాయి. ఒక్కొక్క ప్రాంత ప్రజలు ఒక్కొక్క స్మృతిని బట్టి ప్రభావితులయి తమ ఆచార వ్యవహారాలను ఏర్పాటు చేసుకున్నారు. కొందరు ఆపస్తంబ స్మృతి, కొందరు అశ్వలాయన స్మృతి, కొందరు బోద్ధాయన, గౌతమ, వాజసనీయ స్మృతులూ, మరికొందరు మరింకేమేమో స్మృతుల ప్రకారం

వ్యవహరిస్తున్నారు. మన ఆచారాలకి ఆధారాలు మన స్మృతులు. కాలాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి, ధర్మం వేరువేరుగా ఉంటుంది అని ఆ స్మృతులే చెప్పుతున్నాయి.

వ్యక్తులకి అర్థకామాదులు ఎంత అవసరమో, లోకక్షేమార్థం, సమాజక్షేమార్థం, వ్యక్తి క్షేమార్థం, ధర్మ ప్రవర్తన చాలా అవసరం. అందుకని ధర్మార్థకామాదులలో ఏ ఒక్కటినీ వదిలేయడానికి లేదు అని స్మృతులు చెప్తున్నాయి. అన్నిటి క్షేమం, అందరి క్షేమం ఎల్లప్పుడూ అమ్మకి కావాలిగాబట్టి ఆమె **వర్ణాశ్రమ విధాయినీ, ధర్మిణీ, ధర్మవర్ధినీ, ధర్మాధారా** అని గుర్తింపబడుతూంది.

ఇప్పుడు మరో విషయంకూడా గ్రహిద్దాం. అరి షడ్వర్గాలలోని క్రోధ–లోభ–మోహ–మద–మాత్సర్యాలతో ధర్మం జత కట్టలేదు. వాటితో మోక్షసాధనకి అవకాశం లేదు. అందుకని అవి దోషపూరితాలు అయ్యాయి. ధర్మార్థకామమోక్షాలు అని చెప్పగలంగానీ, ధర్మార్థక్రోధమోక్షాలనో, ధర్మార్థమోహమోక్షాలనో .. చెప్పలేము. అరి షడ్వర్గాలలోని కామంతో మాత్రం ధర్మం జత కట్టగలదు. అందుకని, కామనాశినీ అనిగానీ, కామశమనీ అనిగానీ అమ్మ నామాలలో లేదు. పైగా, **కామదాయినీ** వంటి నామాలున్నాయి.

ధర్మార్థకామమోక్షాలను చతుర్విధ పురుషార్థాలని గూడా అంటారు. అమ్మ **పురుషార్థప్రదా, సర్వార్థ దాయినీ.**

## అధ్యాయము 06

# శ్రీ సత్యవ్రతా, సత్యరూపా, ... విష్ణుమాయా, విలాసినీ

**వాగధీశ్వరీ, వాగ్వాదినీ, దక్షిణామూర్తిరూపిణీ** అని అమ్మ నామాలు. ఈ నామాలలో కూడా వ్యత్యాసం గ్రహించదగినది. వాక్కులకు ఆమె అధిష్ఠాన

దేవత. దక్షిణామూర్తి ఎప్పుడూ మౌనంగానే ఉంటాడు. కానీ ఆయనను చూడగానే మనకున్న సంశయాలన్నీ తీరిపోతాయిట. భోజరాజుని చూడగానే శుంఠలుగూడా కవిత్వం చెప్పేసేవారుట, అలాగే దక్షిణామూర్తిని చూడగానే, ఆయన ఏమీ మాటలాడకుండానే మన డౌట్సన్నీ క్లియర్ అయిపోతాయి. అమ్మగూడా **నిస్సంశయా, సంశయఘ్నీ** అనిపించుకుంది. ఆమెకి ఏ సంశయాలూ ఉండవు; మనకేమైనా సంశయాలుంటే అవి తీర్చేస్తుంది. కానీ ఆమె వాగ్వాద స్వరూపం కూడా.

"అగ్నిర్మే వాచిస్త్రిష్ఠతు" అని న్యాసంలో వస్తుంది. నా వాక్కుయందు అగ్ని సెలకొని ఉంది, అని. కొందరు మాటలాడుతూంటే నిప్పులు గక్కినట్లుంటుంది. మాటలోనే మంటలుంటాయి. కానీ మాటల జోరుకీ ఈ మంత్రానికీ ఏమీ సంబంధం లేదు. అగ్ని పవిత్రతను సూచిస్తుంది. అంటే నేను పలికే వాక్కులో పవిత్రత సెలకొని ఉంది అని చెప్పుతోంది ఈ మంత్రం. ఆ పవిత్రత ఎలా సిద్దిస్తుంది?

ఎల్లప్పుడూ సత్యాన్ని విడవకుండా ఉంటే పవిత్రత సిద్ధిస్తుంది. అలాంటివారికి వాక్శుచి, వాక్శుద్ధి, వాక్సిద్ధి సంభవిస్తాయి. "కిం భగవన్తః పరమం వదన్తి? సత్యేన వాయురావాతి, యేనాదిత్యో రోచతే దివి, సత్యం వాచః ప్రతిష్ఠా, సత్యే సర్వం ప్రతిష్ఠితం, తస్మాత్ సత్యం పరమం వదన్తి" – పరమపదమైనవి ఏవి? అన్న ప్రశ్నకి చెప్పిన జవాబులలో దాన ధర్మ యజ్ఞాదులతోపాటు సత్యం కూడా చెప్పబడింది. వాక్కులోని "సత్యము" వలన ఈ గాలి వీస్తూంది, సూర్యుడు వెలుగుతూన్నాడు, సర్వమూ సత్యమందే సెలకొని ఉన్నది. అందుకని "సత్యం వద", "సత్యాన్న ప్రమదితవ్యం", "సత్యం తపః" – సత్యాన్ని దాటగూడదు, సత్యమన్నది ఒక తపస్సు – అని వేదాలు, ఉపనిషత్తులూ హెచ్చరిస్తున్నాయి. "సత్యం బృహద్ ఋతమ్ ఉగ్రం దీక్షా తపో బ్రహ్మయజ్ఞః పృథ్వీం ధారయన్తి" – అంటే సత్యమూ, క్రమశిక్షణ, కఠోర దీక్ష, తపస్సూ ఈ పృథివిని కాపాడుతున్నాయి.

ఈ నేపథ్యంలో అమ్మవారి నామాలలో "సత్యం" ఎంత ప్రాముఖ్యతగా చెప్పబడిందో చూద్దాం. **సత్యానంద స్వరూపిణీ** సత్యమూ, ఆనందమూ ఆమె స్వరూపము. **సత్-అసత్-రూపధారిణీ** – సత్ అంటే బ్రహ్మము, అసత్ అంటే జగత్తు. ఈ రూపాలను ధరించేది ఆమెయే. **సత్యసంధా** – సత్యానికి బద్ధురాలై ఉన్నది. **సచ్చిదానంద రూపిణీ** – ఆమె సత్-చిత్-ఆనంద రూపము. **సత్యజ్ఞానానంద రూపా** – సత్యము, జ్ఞానము వలన కలిగే ఆనందరూపము. **సత్యవ్రతా, సత్యరూపా** – సత్యమే వ్రతముగా కలిగినవారిచే పొందదగిన ఆమె సత్యాన్ని రక్షిస్తూంటుంది. సత్యము ఆమె రూపమే.

**సత్-అసత్-రూపధారిణీ** అనే నామం చాలా ముఖ్యమైనది. ఈ జగత్తంతాగూడా ఆమె రూపమేనని చెప్తూంది. జగత్తు మాయారూపమైన అసత్యమైనదేతే అదీ ఆమేనా? ఆహా, అదీ ఆమెయే. మాయామిథ్యలు ఆమెచే కల్పించబడినవే అని **మిథ్యాజగదధిష్ఠానా** అనే నామం తెలియచేస్తూంది. ఈ మిథ్యలు, మాయలు కల్పించడమెందుకు? సృష్టించబడిన ఈ లోకాన్ని రక్షించటంకోసం మాయామిథ్యలు అవసరం; తప్పదు. మిథ్యా, మాయలలో పడ్డవాడికి తత్సంబంధమైన కోరికలు కలిగి బలంగా ఉంటాయి కాబట్టి ఆ కోరికలనుపయోగించుకుని లోకానికి మంచి చేయవచ్చు.

"కామసంహర్త్రీ" అనే నామం దుర్గా అష్టోత్తరంలో చెప్పబడింది. లలితా సహస్రంలో **కామదాయినీ** అని చెప్పబడింది. కోరికలని కలుగచేసేదీ తీర్చేది ఆమెయే అనే ఈ నామాన్ని సామాన్య దృక్పథంతో ఆలోచిద్దాం. కోరికలకుండే శక్తిని తక్కువగా అంచన చేయకూడదు. ఉదాహరణగా అందరికీ తెలుసున్న ఓ కథని మరోసారి పరిశీలిద్దాం. పడవ నడుపుకుని జీవించే ఓ పడుచుపిల్ల. నది దాటదామని వచ్చిన ఓ బ్రహ్మర్షి ఆమెను చూసి ఆకర్షితుడయ్యాడు. ప్రొపోజ్ చేశాడు. నేనేమిటి. నాకున్న చేపల వాసనేమిటి, తనని వదిలెయ్యమని చెప్పింది. ఫర్వాలేదు, ఆమెకున్న చెడు వాసనని తను పోగొడ్తానన్నాడు. ఎలా అని అడిగితే, తన

తపశ్శక్తితోనన్నాడు. అయినా, ఇంకా చీకటి పడలేదుగదా, అందరికీ కనిపించేస్తాం, తనని వదిలెయ్యమని చెప్పింది. ఎవరికీ కనిపించకుండా చీకటి అయిపోయేలా చేస్తానన్నాడు. ఎలా అని అడిగితే, తన తపశ్శక్తితోనన్నాడు. అమ్మో, అయినా నా కన్యాత్త్వం చెడిపోతుంది, తనని వదిలెయ్యమని చెప్పింది. అదిగూడా చెడిపోకుండా చేస్తానన్నాడు. ఎలా అని అడిగితే, తన తపశ్శక్తితోనన్నాడు. వాసన పోయేలా చేయగలవా, లేని చీకటిని తెప్పించగలవా, కన్యాత్త్వం చెడకుండా చేయగలవా? ఆ తపశ్శక్తితో నీకు నాపై ఉన్న కోరిక పోగొట్టుకోరాదూ, అని అడిగింది. అమ్మో, కోరిక పోగొట్టుకోవటానికి నా తపశ్శక్తి చాలదు అన్నాడు. అతని ఆ కోరికకి అంత బలముంది. ఆ బలం లేకపోతే వ్యాసోద్భవం, తద్వారా వేదోద్ధరణ, పురాణరచన జరిగుండేవి కావు.

పరాశరుడు వంటి ఋషులో, దుష్యన్తుడివంటి మహారాజులో, సామాన్య సగటు మనుష్యులో, ఎవరైనా కావచ్చు. మాయామిథ్యలలో కొట్టుమిట్టాడక తప్పదు. "జగమే మాయా, బతుకే మాయా" అని ఒక కవి వ్రాస్తే, అలా అని "తెలిసీ వలచీ విలపించుటలో తీయదనం ఎవరికి తెలుసు" అని మరో కవి వాపోయాడు. తెలిసీ వలచీ విలపించినవారిలో అంతా తెలిసిన శ్రీ గాయత్రీ మన్త్రఋషి విశ్వామిత్రుడొకడు. అదే అమ్మ కల్పించే **విష్ణుమాయ**. **లీలావినోదినీ లలితాంబిక**కు అది విలాసం – **విలాసినీ**.

## అధ్యాయము 07

# శ్రీ యోగానందా, విన్నంజాలు భవన్మహత్త్వము

"విన్నం జాలు భవన్మహత్త్వము, భవద్విజ్ఞాన సద్గోష్ఠియం
దున్నం జాలు, భవత్పదాంబురుహ సేవోత్సాహ సంపన్నులం
గన్నం జాలు, భవత్సమంచిత జగత్ కల్యాణ నామంబు బే
ర్కొన్నం జాలు, నరుండు శాశ్వత శుభారూఢుండు లక్ష్మీశ్వరా ।"

హిరణ్యకశిపుని అణచమని శ్రీ మహావిష్ణువుని ప్రార్థించటం కోసం వెళ్ళినప్పుడు ఆయనను స్తుతిస్తూ దేవతలు, ఋషులూ చెప్పిన ఘట్టంలో ఎర్రాప్రగడ వారు నృసింహ పురాణంలో చెప్పిన ఒక అద్భుత పద్యమిది.

**కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః** – అని శ్రీ లలితా సహస్రనామం. అమ్మ వేళ్ళగోళ్ళనుంచి నారాయణుని దశావతారాలూ పునరుద్భవించాయిట.

ఈ దశావతారాలలో కూర్మ, నృసింహ అవతారాలను సప్తశతి (11) ప్రత్యేకంగా పేర్కోగా, అందులో అమ్మగురించి "నృసింహరూపేణ ఉగ్రేణ హన్తుం దైత్యాన్ కృతోద్యమే, త్రైలోక్యత్రాణ సహితే, నారాయణి, నమోస్తుతే" అని చెప్పబడింది. దైత్యులని సంహరించి మూడు లోకాలను రక్షించి తీరాలనే దీక్షతో ఉగ్రనృసింహ రూపంగా అవతరించిన తల్లీ నమస్కారము. శ్రీ లలితా సహస్రంలో **యోగానందా** అనే నామం నృసింహస్వామిగా ఆమెను తెలియచేస్తూంది.

**విష్ణురూపిణీ, గోవిన్దరూపిణీ** అని నామాలున్నాయి. **గోమాతా** అని కూడా మరో నామం. "గో"అంటే ఆవు అనేగాక వాక్కు, నీరు, దిక్కు, కన్ను, భూమి, వగైరా అర్థాలుతోపాటు మరో పది అర్థాలున్నాయి. మనం సాధారణంగా పూజలు మొదలైనవి చేసినప్పుడు 'సంకల్పం'చెప్పుతూంటాం. సంకల్పం చెప్పిన తరువాత "గోవిన్ద, గోవిన్ద, గోవిన్ద" అంటూ కాసిని నీళ్ళు పళ్ళెంలో వదిలిపెట్టడమో, లేక అక్షింతలు వెనక నేలమీద వేయటమో చేస్తాము. దీన్ని ఒకలా అర్థం చేసుకోవచ్చు. పంచభూతాల (నీరు, నేల వగైరా) సాక్షిగా, సంకల్పంలో చెప్పిన మాటని రక్షించమని, అనగా, మాట నిలబెట్టుకునేలా చూడమనీ, ఆ దైవాన్ని ప్రార్థిస్తున్నాము. మనకి మధ్యలో విఘ్నాలు కలగకూడదు.

అమ్మ **గోవిన్దరూపిణీ, విఘ్ననాశినీ**. ఇచ్చిన మాటని నిలబెట్టుకోగలిగే

సామర్థ్యాన్ని కలగచేసి, ఏ విధమైన అడ్డంకులూ రాకుండా మనలను ఆదుకునే అమ్మ **నిస్సీమ మహిమా** – అవధులులేని మహిమ గలది గదా! ఆ మహత్త్వముగురించి వినటం కూడా ఒక వరమే.

## అధ్యాయము 08
## అమ్మ చిరునామా: **శ్రీ అనేక కోటి బ్రహ్మాండ జననీ ....**

ప్రహ్లాదుడితో మొదలు పెడదాం. హిరణ్యాకశిపుడు, ప్రహ్లాదుడి హరిభక్తికి మండిపోయి, "హరి, హరి అంటావు. ఎక్కడరా ఆ హరి? నేనెన్నిచోట్ల వెతికినా కనిపించలేదు. నీకెక్కడ కనిపించాడు ఈ హరి?" అని నిలదీశాడు. హరి పేరు వినగానే ప్రహ్లాదుడు పరవశుడైపోయి, నర్తనాలు చేస్తూ, "ఓ పిచ్చివాడా, ఎక్కడచూసినా హరి ఉన్నాడే" అంటూ ఒక పెద్ద లిస్టు చదివాడు. 'పెదకంగానేల యీ యా యెడన్' – ఇక్కడ, అక్కడ అని ప్రత్యేకించి పెదకాలా? అని తనూ నిలదీశాడు. "ఇందుగలడందులేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు, ఎందెందు పెదకి చూచిననందందే గలడు దానవాగ్రణీ" అని బదులిచ్చాడు. హిరణ్యాకశిపుడు దగ్గరలో ఉన్న స్తంభంలో చూపించమన్నాడు. ప్రహ్లాదుడు ఇంకా అడగకుండానే "నేనిక్కడే ఉన్నానే" అంటూ ఆ స్వామి ఆవిర్భవించాడు. ఈ కథ విన్నప్పుడల్లా నాకిప్పటికీ ఒక దగుల్బాజీ సందేహం వస్తూంటుంది. హిరణ్యాకశిపుడు కూడా జ్ఞానీ, గొప్ప భక్తుడు. హరిని తన గుండెల్లో చూపించమని ఎందుకు అడగలేదు – అని నా సందేహం! అంటే హరి తన గుండెల్లో కచ్చితంగా లేడని నమ్మకమేమో! సరే, ఈ కథ వదిలేసి అమ్మని గురించి ఆలోచిద్దాం. ఆమె ఎక్కడ ఉంది? ఆమె ఎడ్రస్ ఏమిటి? దీనిగురించి శ్రీ లలితా సహస్రంలో ప్రస్తావన ఉందా?

ఆమె **అనేక కోటి బ్రహ్మాండ జననీ**. కోట్ల కొలదీ ఉన్న బ్రహ్మాండాలన్నిటికీ ఆమెయే తల్లి. ఈ బ్రహ్మాండాలలో ఎక్కడైనా ఉండవచ్చు. ఎక్కడని

మానవమాత్రులం మనం వెతికి పట్టుకోగలం! అసంభవం. ఇంకో చిరునామా ఏదైనా ఉందా? ఆ ఉంది. ఆమె **భానుమండల మధ్యగా, రవిప్రఖ్యా, మిత్రరూపిణీ**. కాబట్టి సూర్య మండలం మధ్యలో ఆమెని పట్టుకోవచ్చు. ఉదయకాలమందు ఋగ్వేదస్వరూపిణి అయి **బ్రాహ్మీ** గాయత్రిగా, మధ్యాహ్న కాలమందు యజుర్వేద స్వరూపిణి అయి రౌద్రీ (**రుద్రరూపా**)) **సావిత్రి**గా, సాయంకాలమందు సామవేద స్వరూపిణి అయి **వైష్ణవీ, సరస్వతీ**గా త్రికాలములందూ **వేదజనని**గా వెలుగుతూ ఉంటుంది. అందుకని ఆమెను **సంధ్యా** అని గుర్తించి ద్విజులు (ఉపనయన సంస్కారమున్న వారు) సేవిస్తూంటారు – **ద్విజబృంద నిషేవితా**.

కానీ సూర్య మండలం చేరటం అంత తేలిక గాదే! ఇంకో చిరునామా ఏదైనా ఉందా? ఆ ఉంది. ఆమె **చంద్రమండల మధ్యగా**. ఆమెని చంద్రమండలంలోగూడా చూడవచ్చు. "చంద్రమండలం ప్రత్యక్ష శ్రీచక్రాత్మకం సంపద్యతే". పౌర్ణమినాటి చంద్రబింబంలో అమ్మని ధ్యానించమని చెప్తూన్నది శాస్త్రము. లేకపోతే **మేరునిలయా** కాబట్టి మేరుపర్వతం పైన చూడవచ్చు.

మేరు పర్వతం ఎక్కడుందో? అదిమాత్రం తేలికా? ఇంకో చిరునామా ఏదైనా ఉందా? కొంచెం కష్టమే. ఎందుచేతంటే ఆమె "**అదృశ్యా, దృశ్యరహితా, మనోవాచామగోచరా, నిరాకారా, వేద్యవర్జితా**". అయినా, ఆమె విశ్వమంతా వ్యాపించి, ప్రత్యక్షంగా గాక, పరోక్షంగా వివిధ ఆకారాలలో కనిపిస్తూనే ఉంటుంది. "**అవ్యక్తా, వ్యక్తావ్యక్త స్వరూపిణీ, వ్యాపినీ, వివిధాకారా**". వేదాలూ, ఆది శంకరులవంటి జ్ఞానులూ సూర్యునిలో, చంద్రునిలో, అగ్నిలో, నీటిలో, ఆకాశంలో, భూమిమీద, వాయువులో, ఆమెనే చూసి విశ్వమంతా ఆమె తప్ప మరేమీలేదే అని ఆశ్చర్యపోయారు. "త్వమర్కస్త్వమిందుః త్వమగ్నిస్ త్వమాపస్ త్వమాకాశ భూ వాయవస్త్వం మహత్త్వం, త్వదన్యో న కశ్చిత్ ప్రపంచోస్తి, సర్వం త్వం," అని విశ్వమంతటా ఆమెనే చూసి శంకరులు కీర్తించారు. " **వహ్నిమండల వాసినీ**" అంటే సోమ సూర్య, అగ్ని మండలాలు. ఆమె **వియత్ప్రసూః,**

**ఓజోవతీ, తేజోవతీ, మహీ, ధరా, బహురూపా,**

విశ్వమంతా ఆమెయే నిండియుంటే, పెదకడమెందుకు? 'పెదకంగానేల యీా యా యెడన్' అని ప్రహ్లాదుడు చెప్పాడుగదా! ప్రక్కనున్న స్తంభం వరకూ కూడా వెళ్ళక్కర్లేదు. ఆమె "**దహరాకాశ రూపిణీ, హృద్యా, హృదయస్థా**". సరిగ్గా చూసుకుంటే మన హృదయంలోనే ఉంది. "చండికాం హృదయేనాపి యః స్మరేత్ సతతం నరః, హృద్యం కామమవాప్నోతి హృది దేవీ సదా వసేత్ ।" – అని సప్తశతి కీలక స్తోత్రం. ఆమెను ఎవరు హృదయపూర్వకంగా ఎల్లప్పుడూ ధ్యానిస్తూంటారో వాళ్ళ హృదయంలోనే ఆమె నివాసముంటుంది. వాళ్ళకు ఈప్సితార్థాలను ప్రసాదిస్తూంటుంది.

అయితే ఆమెను చూడటం ఎలా? గుండెలని చీల్చుకుని చూస్తే ఆంజనేయస్వామికి సీతారాములు కనిపించినట్లుగా, అమ్మ కనిపిస్తుందా? లేదు; కనిపించదు. ఆమె "**అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా**". బహిర్ముఖంగా కనిపించే ప్రసక్తి లేదు. అంతర్ముఖంగా మాత్రమే అమ్మని దర్శించుకోగలము.

అదిమాత్రం తేలికా? కాదు. తపన ఉండాలి, దీక్ష పట్టాలి, సాధన కావాలి. వీణలు, వయొలిన్లు, వేణువులు, మృదంగాలూ సాధన చేసినవారికే మధురగీతాలు పలికిస్తాయి. ఆ సాధన చేయనివారూ, చేయలేకపోయినవారు, మధురగీతాలని వినటం మాత్రమే చేయగలరు, పలికించలేరు. అసలు ఆ ఆసక్తియే లేనివారికి అవే వీణలు, వయొలిన్లు, మృదంగాలూ చెక్కముక్కలుగాను, ఇనపతీగలుగాను, పెదురుబొంగులుగానూ కనిపిస్తాయి తప్ప వారు మాధుర్యాన్ని పొందలేరు. ఇది స్వయంప్రజ్ఞకి చెందిన విషయం. "యస్య నాస్తి స్వయంప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిం, లోచానాభ్యాం విహీనస్య దర్పణం కిం కరిష్యతి" – స్వయంప్రజ్ఞ లేనివారికి శాస్త్రం మాత్రం ఏమి ఉపయోగము? అంధుడికి అద్దం చూపించినట్లు అవుతుంది – అని చాణక్య నీతి.

సాధన చేయాలి అంటే ఆసక్తి, స్వయంప్రజ్ఞ ఉండాలి. సాధన చేసినవారికి అమ్మ చిరునామా అక్కరలేదు. ఆమె ఎల్లప్పుడూ వారిదగ్గిరే ఉండగా, ఇంక చిరునామా ఎందుకు?

## అధ్యాయము 09
# శ్రీ అన్నదా, వసుదా, పూర్ణా

ఓం, పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే । ఇది చాలామందికి తెలిసిన శాన్తిమన్త్రం. పరదేవత అన్నివిధాలా పరిపూర్ణమైయున్న **సర్వజ్ఞా**, అంటే ఆమెకు లేనిదీ, తెలవనిదీ ఏమీ లేదు. నిపుణులు ఎప్పుడు ఏపనిచేసినా నైపుణ్యం ఉట్టిపడుతూంది గద! అందుకని ఆ పరదేవతే సృష్టించిన ఈ జగత్తు కూడా అన్నివిధాలా పరిపూర్ణమైనది. ఏ లోటూ లేకుండా చేసిన తల్లి. సూర్యచంద్రులుని, పంచభూతాలుని సృష్టించి, మనకి అన్ని సౌకర్యాలూ చేకూర్చింది. **అన్నదా** – అన్నం పెట్టి ప్రాణాలను కాపాడే అన్నపూర్ణ **ప్రాణదా, ప్రాణదాత్రీ**. **వసుదా** – సంపదలనిచ్చిన **మహాలక్ష్మీ**. **జ్ఞానదా** – జ్ఞానాన్ని ప్రసాదించిన **సరస్వతీ**. **భక్తిమత్కల్పలతికా** – సంపూర్ణ–అసంపూర్ణ భక్తులపాలిట కల్పలత. **వాంచితార్థ ప్రదాయినీ** – భక్తులు అడిగినదల్లా, వారికి లేనిదల్లా, ఇచ్చి యోగం కలుగచేసే **యోగదా**. అందరి భక్తులకు సుఖం కలుగచేసే అమ్మ – **సమస్త భక్త సుఖదా**. మనకి ఇచ్చేసినందున ఆమెకి ఏమైనా తక్కువైపోయిందా? ఏమీ తక్కువవదు. అనన్తమైనదానినుంచి ఎంత తీసినా శేషం ఇంకా అనన్తమే అని పై శాన్తిమన్త్రం చెప్పుతూంది. When infinity is subtracted from infinity, the remainder would still only be infinity. ఆమె ఎల్లప్పుడూ నిండుగానే ఉండే **పూర్ణా**. "పూర్ణ" పదాన్ని రెండు విధాలుగా అర్థం చేసుకోవాలి. ఒకటి, అన్నీ కలిగియుండి లేకపోయినదేదీ లేదు అని.

"అభూతిం అసమృద్ధిం చ సర్వాన్నిర్ణుద మే గృహాత్" అని శ్రీ సూక్తం. కానీ పరిమితులున్నచోట అన్నీ ఉండితీరాలి అంటే అది అసాధ్యం. పరిమితులులేని అనన్తమైనప్పుడే పరిపూర్ణత సాధ్యమౌతుంది. అంటే రెండో అర్థం, అనన్తం అని. పైన చెప్పిన శాన్తిమన్త్రం ఈ రెండర్థాలనూ గ్రహిస్తోంది. ఆమె సంపూర్ణతను తెలియచేసే మరో నామం **అనవద్యాంగీ**. ఆ **శాన్తిమతీ, స్వస్తిమతీ, సర్వమంగళా, శ్రీమాత, లలితాంబిక**కు మంగళం, జయమంగళం, నిత్యశుభమంగళం!

**సర్వ మంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే, శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తు తే।**

**ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః.**

శ్రీ మహాగణపతయే నమః
ఓం శ్రీ మాత్రే నమః

సిందూరారుణ విగ్రహాం త్రినయనాం మాణిక్య మౌళిస్ఫుర
త్తారానాయక శేఖరాం స్మితముఖీం ఆపీనవక్షోరుహాం
పాణిభ్యాం అలిపూర్ణ రత్నచషకం రక్తోత్పలం బిభ్రతీం
సౌమ్యాం రక్తఘటస్థ రక్తచరణాం ధ్యాయేత్ పరాం అంబికాం ।

అరుణాం కరుణాతరంగితాక్షీం ధృతపాశాంకుశ పుష్పబాణచాపాం
అణిమాదిభిరావృతాం మయూఖైః అహం ఇత్యేవ విభావయే భవానీం ।

ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసితవదనాం పద్మపత్రాయతాక్షీం
హేమాభాం పీతవస్త్రాం కరకలితలసత్ హేమ పద్మాం వరాంగీం
సర్వాలంకారయుక్తాం సతతం అభయదాం భక్తనమ్రాం భవానీం
శ్రీ విద్యాం శాన్తమూర్తిం సకలసురనుతాం సర్వసమ్పత్ ప్రదాత్రీం ।

సకుంకుమ విలేపనాం అళికచుంబికస్తూరికాం
సమన్దహసితేక్షణాం సశరచాపపాశాంకుశాం
అశేషజనమోహినీం అరుణమాల్యభూషోజ్జ్వలాం
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరేత్ అంబికాం ।

వందే మాతరం అంబికాం భగవతీం వాణీ రమా సేవితాం
కల్యాణీం కమనీయ కల్పలతికాం కైలాసనాథప్రియాం
వేదాన్త ప్రతిపాద్యమానవిభవాం విద్వన్మనోరంజనీం
శ్రీచక్రాంకిత రత్నపీఠనిలయాం శ్రీ రాజరాజేశ్వరీం ।

జగదంబాయై నమః, వందే జగన్మాతరం.



N.S.S. Narayana received his early education from Andhra Geervana Vidya Peetham, Kovvur (A.P.).

He did B.E. (mechanical) at Andhra University, Waltair, Ph.D. (economics) at Indian Statistical Institute, Delhi Centre, and also M.A. (Sanskrit) from KSOU, Mysore.

Dr. Narayana worked in the Planning Commission, New Delhi, Madras University, Chennai and International Institute for Applied Systems Analysis, Laxenburg (Vienna). He is currently Professor of Economics at Indian Statistical Institute, Bangalore Centre. He has published several research papers in national and international journals. His academic interests include Computable General Equilibrium models, Planning models, Agricultural economics, Econometric applications and Time series analysis and Indology.

---

**Srimaata Nisseema Mahima (2012)** **Rs.45/-**


Prof. N.S.S.Narayana
12-3-18, Satya Vilas
Mudu Dabaala Veethi
Kovvuru - 534350 (W G Dt. A.P.)